నవంబరు 1976



సంపుటి: 14
సంచిక: 10

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు:
కీ.శే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్:
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

సహకార సంపాదకుడు: వేమూరి సత్యనారాయణ

# విషయసూచిక



ముఖచిత్రం: మోడల్ ప్రొడక్షన్స్‌వారి 'సుప్రభాతం'లో వాణిశ్రీ.

జ్యోతి, 40/1 మూసాసేట్ స్ట్రీట్, టి. నగర్, మద్రాసు-600017.
ఫోన్: 440548. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు. 42/-.

# తొలిమాట

గత సంచికలో ప్రకటించినట్లుగా మిస్టర్ సంపత్, ఎం.ఏ. ఈ సంచికతో పూర్తిచేయలేకపోయాము. అంచనా తప్పిన పేజీల సంఖ్య ప్రతిబంధకమై ఈ సీరియల్ మరో నెలవరకూ పొడిగించక తప్పనిసరైంది. డిసెంబరు 76 సంచికతో ఆ సీరియల్ ముగుస్తుంది.

జై మంగళా కూడా ముగింపుకు దగ్గరపడుతూంది. 1977 జనవరి సంచికనుంచీ 'నూతన సంవత్సర కానుక'గా జ్యోతి, ప్రఖ్యాత రచయిత డా॥ కొమ్మూరి వేణుగోపాలరావు నవలను సీరియల్‌గా ప్రారంభిస్తుంది. నవల పేరూ, ఇతర వివరాలూ వచ్చే సంచికలో చూడగలరు.

* * * *

ఈ సంచిక మీ చేతికొచ్చిన పది రోజుల లోపలే జ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక మీ ముందు వాలుతుంది. ఈ సంవత్సరం దీపావళి ప్రత్యేక సంచికలో ప్రత్యేకాకర్షణగా బాపు చిత్రించినదొకటీ, ప్రముఖ ఫిల్మ్ పబ్లిసిటీ ఆర్టిస్టు ఈశ్వర్ చిత్రించినవొకటీ వర్ణచిత్రాలు అందిస్తున్నాము. ముఖచిత్రం బాపు. గత సంవత్సరం ప్రత్యేక సంచికకంటే ఎక్కువ పేజీలతో, ఎక్కువ కథలతో మీకోసం ప్రత్యేకంగా తయారవుతున్నది దీపావళి ప్రత్యేక సంచిక.

* * * *

1976 సంవత్సరానికి తెలుగు సినిమా కథలలో ద్వితీయ బహుమతి పొందిన 'మా వూరి గంగ' కథారచయిత్రి యార్లగడ్డ సరోజినీదేవి రాసిన పూర్తి నవల 'కాటేసిన సుఖం' జ్యోతి డిసెంబర్ సంచికలో ప్రచురిస్తున్నాము.

వె. వెంకటరామయ్య

# నా పేరేమిటో చెప్పండి...

నాకు 20 చేతులున్నాయి
మనిషిని కాదు
మనిషిని బాగుచేయడానికి పుట్టాను
నా పేరేమిటో చెప్పండి

నాకు 20 కొమ్మలున్నాయి
చెట్టును కాదు
నా నీడలో చేరిన వారికి చల్లని జీవితం ప్రసాదిస్తాను
నా పేరేమిటో చెప్పండి..

నాలో ఇరవై రంగులున్నాయి
ఇంద్రధనుస్సును కాదు
నిరుపేదల జీవిత ఫలకాలమీద రంగులు వేస్తాను
నా పేరేమిటో చెప్పండి ..

నేను యిరవై అమ్ముల గాండీవాన్ని
సమాజంలోని ప్రజాశత్రువు లందరినీ గురిచూసి కొడతాను
ఆధునిక కురుక్షేత్ర యుద్ధ రంగంలో
అధర్మాన్ని వెంటాడి తరిమి తరిమి కొడతాను!

---

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

# ఉత్తరాలు

ఆచారాలను "నడ్డి విరక్కొట్టిన" శ్రీశ్రీ. "ఓం నమఃశివాయ" అని దిద్దించాడా. శివః శివః

అక్టోబరు పత్రికలోని ఆయన శీర్షికలో, పవివాని పలుకుల ముచ్చటను మించి హాస్యంపాలు మరేముంది.

"అవసరకాలం వచ్చినప్పుడు, అవసర చట్టం అవసరం" నచ్చిందా శ్రీశ్రీకి— పాపం—అవసరం అలాంటిది మరి.

మహాకవి కలానికి భీభత్సభయానకాలు నప్పినట్లు మరేమీ నప్పవేమో. (???)

"మ హా నై వే ద్యం" ఎదురుచూసే పాఠకులకు "అవసరనైవేద్యం'' తయారయ్యింది.

—పి. సుబ్బుకృష్ణయ్య, హైదరాబాద్.

## పదబంధ ప్రహేళిక (2) సందేహం

మహాకవి శ్రీశ్రీ పదబంధ ప్రహేళికలో నాకు తోచిన సందేహాలు

'ప్రహేళిక' అనే పేరు పెట్టినందుకు దానిని అనుసరించే ఉండాలి దానిక్రింద ఇచ్చే పదాలు, లేక వాక్యాలు. దీనిలో కొన్ని ఆ నిర్వచనానికి ఎదిరింపులేగాని కుదింపులూ కావు. మదింపులూ కావు. ఎందుకుకావో జిజ్ఞాసతోగాని, జిగీషతో గాని 'జ్యోతి' ద్వారా అడిగితే పై సంచికలో చెప్తాను. సాహిత్య సాంకేతిక విషయము కనుక దీనిని గురించి దబాయింపులూ సంర్ధకభయానకాలూ ... ప్రదర్శించరాదని నా అభ్యర్థన.

అడ్డం

33 ఏకవచనంలో 14 అని వుంది. నిలువున కిచ్చే పదాలనుబట్టి దీనికి 'శత్రువు' అని వ్రాయాలి. 'శత్రువు' అనే ఎందుకు వ్రాయాలో శ్రీశ్రీ చెప్తే సంతోషిద్దాం దాని సామంజస్యం తరువాత చూద్దాం (నాకు తెలుసుననుకోండి.)

నిలువు

10 శిఖకి వికృతి— దీనికి అడ్డంగా ఇచ్చిన పదంకోసం 'సిగ' అని వ్రాయాలి. భాషాశాస్త్ర సంప్రదాయం ప్రకారం శిఖకి వికృతి 'సిక' 'సిగ' రూపాంతరం. ఏమంటారు?

12 పూర్ణిమ రావడం. 'రాక' అని వ్రాయాలి. రాక సాధారణ పూర్ణిమకు చెప్పదు. మరి ఎలా కుదురుతుంది 'రాక'?

16 వెన్నెల రేయి. 'రజని' అని రాస్తేనే అక్కడ పూర్తి అవుతుంది. కాని 'రజని' అనే పదం 'రాత్రి' అనే అర్థములోనే రూఢం— 'వెన్నెలరేయి' అనే అర్థం ఎలా వస్తుందో?

ఏకాక్షర పదాలు

తెలుగులో ఇస్తున్న— 'ప్రహేళిక'— కనుక దానిలో వచ్చే పదాలు తెలుగుకి సంబంధించేవై ఉండడం సబబు. అన్యదేశ్యాలివ్వడం ప్రహేళిక సాంకేతికార్థవస్తననుసరించి సహ్యంకాదు.

పైన ఇచ్చిన సందిగ్ధాంశానికి శ్రీశ్రీ సమాధానం కోరడం సముచితమే అనుకుంటాను.

—యామిజాల పద్మనాభస్వామి, మద్రాసు.

అక్టోబరు సంచిక 'జ్యోతి'లో పూర్తి నవల 'పెళ్ళయ్యాక చూడు' ఆసాంతం చదివాను. జీవితంలో వివాహం ఒక ప్రధాన ఘట్టం. దాన్ని పూరించి తన బ్రతుకుబాటను భార్య, బిడ్డలతో సుగమం చేసుకొనే ఒక వ్యక్తి జీవిత కథను, వేరొక బ్రహ్మచారికి తన సహజ చమత్కృతి, చాతుర్యంతో రచయిత్రి 'వసుంధర'గారు చక్కగా వివరించారు. నవలలో వైవిధ్యం వుంది. పాఠకులను తన పంథాలో అతినేర్పుగా నడిపే తీరు 'వసుంధర' గారి కలానికి వుంది. రచయిత్రి తన ముందుమాటలో వెల్లడించినట్లుగా ఇది గృహస్థాశ్రమ విశేషాల వినోద లహరియై, నన్ను ముగ్ధుడ్ని చేసింది. 'వసుంధర' గారి కలంనుండి మరిన్ని చక్కని రచనలు జాలువారాలని కోరుతూ, ఇంత చక్కని రచనను పాఠకుల కందించిన వసుంధరగారికి నా శుభాకాంక్షలు!

—డి. ఆదినారాయణ, అనకాపల్లి.

అక్టోబర్ జ్యోతి జయప్రద ముఖ చిత్రంతో చాలా అందంగా ఆకర్షణీయంగా తయారై వచ్చి మమ్మల్ని చాలా ఆనంద [illegible]రిచింది.

ముఖ్యంగా, పెళ్ళయ్యాక చూడు. వసుంధరగారి నవల చాలా బావుంది కాని ముగింపు చాలా సడన్‌గా ఆపుచేసినట్లు వుంది. అయినా కాని చాలా బావుంది. కౌసల్యాదేవిగారి సత్యం శివం సుందరం సీరియల్ చాలా ఆసక్తికరంగా సాగుతోంది.

డా॥ సి. హెచ్. శ్రీనివాసరావు,
లక్ష్మీపాలెం.

అక్టోబర్-76 నెల "జ్యోతి" కమ్మని కథలతోనూ, చక్కని నవలతోనూ చక్కగా ముస్తాబై మా చేతుల నలంకరించింది. ముఖ్యంగా కౌసల్యాదేవిగారి సీరియల్ నన్ను బాగా ఆకర్షిస్తోంది. మినీ కథలు బాగున్నాయి. కార్టూన్స్ కడుపుబ్బ నవ్విస్తున్నాయి. "సినిమా" చదువుచున్నప్పుడు-సినిమా చూస్తున్నట్లే అనిపిస్తోంది.

—ఎన్. జ్యోతి కుమార్, భీమవరం.

### హాస్య రసం

చూశారా బపూన్ని
విన్నారా వాడి మాటల్ని
అది అందించే మోదం
సామాన్యులకు ఆమోదం!
చదివారా శ్రీశ్రీని
విన్నారా సిరిసిరి రవళిని
ఇది అందించే హాస్యం
నవతకో సరికొత్త భాష్యం!
అరవంలో కోడిగుడ్డు
ఎలా అయింది బందరు లడ్డు?
చిక్కును విడదీసిన ఈ వాదం
తెలుగువాడిగా నాకు ఆమోదం!

—పి. పార్థసారథిరెడ్డి, పూలికుంట

అభిమాన నటి "జయప్రద" ముఖ చిత్రంతో వచ్చిన ఈనెల "జ్యోతి" ఆకర్షణీయంగా వుంది. నవరసాల(లో) శ్రీశ్రీ రచన అనుకున్నంత హాయిగా లేదు. నవలానుబంధంలో ఇచ్చిన "పెళ్ళయ్యాక చూడు" ప్రారంభంలో ఆసక్తిని కల్గించ లేదు. 'వసుంధర'గారి రచన కావటంవల్ల మరింత దీక్షగా వదలకుండా పూర్తి చేసాను. జీవితంలో, ప్రతి కుటుంబంలో

జ్యోతి 'ఉత్తరాలు' శీర్షికలో ప్రచురించబడే లేఖలలో ఉత్తమ లేఖలు కొన్నిటికి బహుమతులుంటాయి— జనవరి 1977 సంచిక నుంచీ —

వివరాలు వచ్చే సంచికలో

---

జరిగే వాస్తవిక విషయాలు ప్రస్తావించి నప్పటికీ ప్రత్యేకత ఏమీ కనిపించలేదు.

—యన్. సత్యానంద్, బెల్లంపల్లి.

అక్టోబరు నెల నవల "పెళ్ళియ్యాక చూడు" ఆణిముత్యం. అందరికీ తెలిసిన సంఘటనలను అందంగా కూర్చారు. ముఖ్యంగా చివరలో రచయిత్రిగారు రాజారావు ద్వారా చెప్పించిన తల్లి తండ్రులు, బిడ్డలు, అనుబంధం, సంసారం— బ్రహ్మాండంగా వున్నాయి. ముఖ్యంగా వసుంధరగార్ని అభినందించాల్సింది, వారు వ్రాసిన తీరుకి, ఈమధ్య కొందరు నాయికను రకరకాల కోణాల్లో వర్ణించడం నాయకుడు అమాంతం కౌగలించుకోటం, అటువంటివి లేకపోవడం హాయిగా వుంది. జీవితంలోని ప్రతి చిన్న విషయాన్ని యింత లోతుగా పరిశీలించి చక్కని రచన చేసినందుకు మరోసారి అభినందిస్తున్నాను. చదువుతున్నప్పుడు నిజజీవితంలో జరిగిన ఎన్నో సంఘటనలు గుర్తుకొచ్చి ఆనందించాము. ఇంత చక్కని, నవలకాదు, రచనను ప్రచురించిన మీకు నా అభినందనలు.

—టి. వి. వేణుగోపాలరావు,
సూళ్ళూరుపేట.

## కృష్ణా జిల్లా తెలుగు రచయితల చతుర్థ మహాసభలు

మచిలీపట్టణం స్పందన సాహితీ సమాఖ్య ఆధ్వర్యంలో కృష్ణా జిల్లా తెలుగు రచయితల చతుర్థ మహాసభలు నవంబరు 20, 21 వ తేదిల్లో మచిలీపట్నంలో జరుగుతాయి. జిల్లాలోని ప్రముఖులు, రచయితలు, సాహితీ మిత్రులు ఈ సభల నిర్వహణకై ఏర్పరచిన వివిధ సంఘాల్లో సభ్యులుగా వున్నారు. మహాసభల్లో వివిధ సాహిత్య సదస్సులు, ప్రతినిధుల సమావేశం, వినోద విజ్ఞాన ప్రదర్శనలు, ప్రత్యేక పుస్తక ప్రదర్శన రచయితల ఛాయాచిత్ర ప్రదర్శన— ఏర్పాటు చేయాలని నిర్ణయించటం జరిగింది. కృష్ణా జిల్లాకు చెందిన రచయిత(త్రు)లు వారి చిరునామాలను, ఫోటోలను స్పందన సాహితీ సమాఖ్య, 23-182-ఇ, న్యూ మునిసిపల్ క్వార్టర్సు, మచిలీపట్నం 521001 కి తెలియజేయవలసిందిగా సమాఖ్య ప్రధాన కార్యదర్శి విజ్ఞప్తి చేస్తున్నారు.

## క్విజ్ పోటీ!

"లయన్సు క్లబ్ గుంటూరునార్త్ ఆధ్వర్యంలో నవంబరు 5వ తేదీన ద్వితీయ రాష్ట్రస్థాయీ క్విజ్‌పోటీ జరుగుతుంది. విజేతలకు విశిష్టమైన రోలింగ్‌ట్రాఫీలు, వ్యక్తిగత బహుమతులు, యోగ్యతా పత్రాలు బహూకరిస్తారని క్లబ్ కార్యదర్శి శ్రీ జి. ఎన్. మూర్తి తెలియచేస్తున్నారు."

మహాకవి శ్రీశ్రీ రచల ప్రత్యేక శీర్షిక!



# నవరసాల శ్రీశ్రీ

## దైవభీతి

ప్రతిదినం దేవుడు లేడనడానికి నిదర్శనాలు కనబడుతూనే ఉంటాయి. అయినా ప్రజలు దేవుణ్ణే నమ్ముకుంటూ ఉంటారు. ఎందువల్ల? భయంవల్ల!

* * *

కంచిగింజల శేషయ్యశెట్టిగారి రామయ్యసెట్టికీ నాకు చిన్నప్పటినుంచీ స్నేహం. ఇద్దరం చిన్నప్పటి నుంచీ మప్పితంగా తల్లిదండ్రుల చాటున భయభక్తులతో పెరిగినవాళ్ళం. క్రమ క్రమంగా నాలో అంతర్ధానమవుతున్న భయం, భక్తీ రామయ్యసెట్టిలో విపరీతంగా పెరిగిపోయాయి. గొంగళీ పురుగును చూసి జడుసుకుంటాడు. చీకటి పడేసరికి ఇంట్లోంచి బయటికి రాడు. నీయంత పిరికివాడు ఈ భూప్రపంచంలో లేడురా అంటాన్నేను. అన్నిటికీ ఆ దేవుడే ఉన్నాడంటాడు వాడు. దేవుడు లేడని నేను వాదిస్తూ ఉంటాను. అయినా నా మాట వినడు. ప్రస్తుతం మా యిద్దరికీ ఒకటి రెండు నెలల తేడాతో ఇరవయిఅయిదేళ్ళ వయస్సు. బహుశా రామయ్యసెట్టి కంటె నేనే ఏ కొద్దిగానో పెద్ద.

చిన్నప్పుడు తాండ్రచెత్తూ, గోటీబిళ్లా ఆటలతో ప్రారంభమై, హైస్కూలులో బాడ్మింటన్‌తో అభివృద్ధిచెంది టౌనుహాలు క్లబ్బుల్లో టెన్నిస్ దాకా మా స్నేహం తీగలా సాగింది. బాడ్మింటన్ రోజుల్లో నేను ఫుట్‌బాల్ కూడా ఆడేవాణ్ని. ఫుట్‌బాల్ అంటే సెట్టికి విపరీతమైన భయం. వాడి కాళ్ళు చీపురుపుల్లల్లా ఉంటాయి, బంతిని తంతేనే కాళ్ళు విరిగిపోతాయనుకుంటాడు.

ఒకమారు ఉప్పుటేరు పక్కలో మాకూ వెలంపేట జట్టుకూ ఫ్రెండ్లీమాచ్ జరుగుతోంది. అప్పుడు అవతలవాడి కాలు తగిలి మా జగన్నాథంగాడి కాలు విరిగిపోయింది. ఫెళ్ళుమని ఎదురు కర్ర విరిగిపోయినట్టు చప్పుడయింది. ఆ చప్పుడుకి హడిలిపోయి, సెట్టి ఇంటికి పరుగెత్తిపోయాడు. ఆ దృశ్యం వాణ్ని చాలా కాలం దాకా కలల్లోకి వచ్చి భయపెట్టేదని నాతో

**ఈ నెల భయానక రసం.**

చెబుతూ ఉండేవాడు. ఫుట్‌బాల్ ఆట మానెయ్యమని నాకు సలహా ఇచ్చేవాడు. మా విశాఖపట్టణంలో అందరూ నన్ను జీపీ అనో, జీ. పీ. కే. అనో పిలిచే వారు. పూర్తి పేరు ఎవరికీ తెలియదను కుంటాను. తెలియవలసిన అవసరం కూడా లేదు. ఇరవయి ఒకటో యేట నేను మద్రాసునుంచి బి.యస్సీ.ప్యాసయి వచ్చిన కొత్త రోజుల్లో అందరూ నన్ను జీ.వీ.కే. నాయుడుగారు అనడం మొదలుపెట్టేరు. బ్రిటిష్ ప్రభుత్వం నాకు రావు సాహెబ్ అన్న బిరుదం ఇచ్చినంతగా నేనప్పుడు పొంగిపోతూ ఉండేవాణ్ని.

* * *

ప్రతిదినం చాలా మంది చనిపోతూం డడం నిజం. చచ్చిపోతున్న వాళ్ళ తాలూకు వాళ్ళు దేవుళ్ళకు మొక్కుకుంటూ ఉండడం నిజం అయినా చచ్చిపోయిన వాళ్ళెవరూ బ్రతికి రాకపోవడం కూడా నిజం.

* * *

మొదట రామయ్యసెట్టి తల్లీ, ఆ తర్వాత ఆరు నెలలు తిరగకుండానే వాళ్ళ నాన్న చనిపోయారు. వాళ్ళని కాపాడమని ఏ దేవుళ్ళకయినా మొక్కుకున్నావా? అని సెట్టిని అడిగాను! "నువ్వు ఉత్త నాస్తి కుడివి. నీకు జవాబివ్వనుపో" అన్నాడు సెట్టి.

కందిగింజల శేషయ్యసెట్టిగారి రామయ్యసెట్టి స్కూలు ఫైనలులో రెండేళ్ళు డింకీలు కొట్టి, ఈ వెధవ చదువు తన కచ్చిరాదని విరమించుకున్నాడు. నాన్నగారి బట్టల వ్యాపారం స్వయంగా చూసుకుంటున్నాడు. అందులో బాగా లాభాలు తీస్తున్నాడు. (అన్నట్టు రామయ్య సెట్టి వాళ్ళ నాన్నగారి మూడో భార్య కొడుకు. మొదటి ఇద్దరూ నిస్సంతుగానే చనిపోయారు. ఆ యిద్దరు భార్యలూ సంతా నం కోసం చెయ్యని నోములు లేవు. తీర్థ యాత్రలు లేవు. దాన ధర్మాలు లేవు.)

అప్పుడే మా మిత్రుడు యల్. జనార్ధనరావుకి తాసిల్దారుఉద్యోగమయింది. అతణ్ణి చూస్తే రామయ్యసెట్టికి చెప్పలే నంత భయమూ, భక్తి ఉన్నాయి. జనార్ధన రావు సెట్టి షాపులో ప్రవేశించి తనకూ, ఇంటిల్లిపాదికీ అయిదు వందల రూపా యల గుడ్డలు ఖరీదు చేశాడు. వచ్చే ఫస్టు తారీఖుకి పూర్తిగా డబ్బు చెల్లించుతా నన్నాడు.అలాంటి ఫస్టులు చాలావచ్చాయి. వెళ్లాయి. గట్టిగా డబ్బిమ్మని అడగడానికి సెట్టికి వల్లమాలిన భయం! తాసిల్దారుగారి దగ్గరనుంచి డబ్బు వస్తుందన్న ఆశ వదులుకున్నాడు సెట్టి!

ఒక సంపన్న వైశ్య కుటుంబపు సంబంధం చూసి చిన్నప్పుడే రామయ్య సెట్టికి వాళ్ళ నాన్న పెళ్ళి చేసేశాడు. ఇప్పుడు మా మిత్రుడికి ఇద్దరు పిల్లలు. ఒక కూతురూ, ఒక కొడుకూ! నాకు పెళ్ళీ పెటాకులూ లేవు. జీవ శాస్త్రంలో బి.యస్‌సి. ప్యాసయినా ఉద్యోగం కూడా లేదు.

నేనూ, సెట్టీ తీర్థపురాళ్ళ దగ్గర బీచిలో కూర్చున్నాం. వాడు లోపల్లోపల ఏదో బాధపడిపోతున్నాడు. నాతో ఏమిటో చెప్పాలనుకుంటున్నాడు. చెప్పలేక పోతు న్నాడు. నేనే తెగించాను. "నీ ఏడుపేమిటో ఏడవ్రా" అన్నాను. ఏడ్చాడే కాని సంగతి

చప్పలేదు.

ఇద్దరం సిగరెట్లు ముట్టించాం. చీకటి పడకముందే ఇంటికి వెళ్ళిపోవాలని రామయ్యసెట్టి ఉబలాటం. ఇంటిదాకా వచ్చి దిగబెడతాను గాని విషయమేమిటో చెప్పమన్నాను. అప్పుడు వాడన్న మాటల సారాంశం ఇది: "ఒరే, జీ.వీ.కే. నేను చస్తున్నాన్రా! నా పెళ్లాం నన్ను మోసం చేసిందిరా! నా కేదీ దారి కనిపించ లేదురా! నా కొడుకుది తెల్లరంగురా! నేనూ, నా పెళ్ళాం నల్లగా ఉంటాము కదా. దానికీ తెల్లవాడెలాపుట్టేడురా? ఎవడో సోల్జరుపేట ఆంగ్లోఇండియన్‌తో పోయి నా పెళ్ళాం ఈ తెల్ల ప్రసాదం తెచ్చుకుందిరా" అంటూ వలవల వాపోయాడు.

అప్పుడు నేను వాణ్ని తెగ చీవాట్లు పెట్టాను. అయిన దానికీ, కాని దానికీ నీ నీడను చూసుకుని నువ్వే బెదురుతున్నా వన్నాను. "మెండీలియన్ థియరీ ప్రకారం ఇద్దరు నల్లవాళ్ళకి ఒక తెల్లా, నల్లా పుట్ట డానికభ్యంతరం ఏదీ లేదన్నాను. నీ భార్య వైపునో, నీ వైపునో పూర్వీకులలో తెల్ల వాళ్ళుండవచ్చును. వాళ్ళివాళ నీ సంతతి కావచ్చు" అన్నాను. కాలేజీలో సంపా దించిన జీవశాస్త్ర విజ్ఞానంతో.

"ఒరే జీ.వీ.కే నా కూతురు అచ్చం నా పోలికేన్రా. ఆ కళ్ళు. ఆ ముక్కు. ఆ నొసలు అన్నీ నేనే అనుకో. ఆడ పిల్ల తండ్రిని పోలితే అదృష్టవంతురా లవుతుందంటార్రా పెద్దలు!"

"తొలికాన్పు ఆడపిల్లయితే చాలా మంచిదని కూడా అంటార్రా!"

"అది సరే కాని ఈ తెల్లవాడు నా కొడుకే అంటావా? కొంచెం తల్లి పోలి కలు లేకపోలేదులే. ఏమో, నీ సైన్సుని నమ్ముతున్నాను."

"దేవుణ్ని నమ్మడం మానుకుంటే బాగుపడతా" వన్నాను నేను.

ఇద్దరం వాడి ఇంటి ముఖం పట్టేము.

*  *  *

ప్రతిదినం సూర్యుడుదయిస్తూనే ఉంటాడు. అస్తమిస్తూనే ఉంటాడు. కాషా యాలు ధరించిన కసాయి బాబాలు క్షుద్ర మైన గజకర్ణ గోకర్ణ విద్యలభ్యసించి జనాల్ని హడలకొడుతూ ఉంటారు. వాళ్ళ తాయెత్తులు జేబుల్లో వేసుకుని పరీక్షలో ప్యాసయినవాళ్ళూ, వాళ్ళిచ్చిన విభూతిని ఆరోజు కొన్న లాటరీ టిక్కెట్టుకు పట్టించడంవల్ల లక్షరూపాయల ప్రైజు కొట్టేసినవాళ్లూ, వాళ్ళ రక్షరేకుల్ని ఎడం చేతితో పట్టుకుని భర్తల దగ్గరకు వెళ్ళిన తర్వాత గర్భం ధరించినవాళ్ళూ ఇలా ఒకటేమిటి లక్షోపలక్షల ఉదాహరణలతో దేవుడి తరఫున సర్వత్రా ప్రచారం సాగి పోతోంది. దేవుడు ఎవరినీ పుట్టించలేదనీ ఎప్పుడూ ఎవరినీ రక్షించలేదనీ అంటే ఎవరూనమ్మరు. దేవుడిమహిమల్ని గురించి ఎన్నెన్ని అభూతకల్పనలతో కూడిన కట్టుకథలనైనా అందరూ నమ్ముతారు.

*  *  *

నువ్వెందరు దేవుళ్ళకి మొక్కుకున్నా మీ అమ్మా నాన్నా ఎందుకు బతకలేదని రామయ్యసెట్టిని సూటిగా ప్రశ్నించాను. "ఆ! దానికేమిటి? కర్మఫలం అంటూ ఒకటి వుండనే వుందిగా" అని జవా బిచ్చాడు వాడు. ఈ దైవభక్తీ, కర్మ సిద్ధాంతమూ కలిసి మనందరినీ పిరికి పందలు చేస్తున్నాయంటే ససేమిరా వాడు ఒప్పుకోలేదు.



1976 సంవత్సరానికి మాగ్సెసె ఎవార్డ్ పొందినవాల్ క్లాలారెన్స్.లార్సెన్ అండ్ టూబ్రో లిమిటెట్ అధ్యక్షుడయిన ఈయనను 'మానవతా దృక్పథంతో భారతదేశంలో పారిశ్రామిక ప్రగతికి, పారిశ్రామిక ఆధునికతకూ కృషి' జరిపినందుకు అభినందిస్తూ ఈ అవార్డు ఇచ్చారు. ఈ సంవత్సరం అవార్డు పొందిన వారిల్లో ప్రముఖ రంగస్థల దర్శకుడు, నటుడు శంభుమిత్రా కూడా ఉన్నారు.

---

తెల్లబిడ్డడు తన కొడుకే అని నేను చెప్పినమీదట ఆ పిల్లణ్ని రామయ్య సెట్టి అల్లారుముద్దుగా చూసుకోవడం ప్రారంభించాడు. ఆ కొడుక్కి ఒకరోజు ఉధృతంగా జ్వరం వచ్చింది. ఒక్కొక్క రోజు గడుస్తూ ఉంటే జ్వరం తగ్గే సూచన లేవీ కనిపించడంలేదు. కొడుకు వైద్యానికిగాను రామయ్యసెట్టి డబ్బును మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చుపెట్టాడు. అయినా జబ్బు నయం కావడంలేదు.

కొడుకు చచ్చిపోతాడేమో అని రామయ్యసెట్టికి నిజంగానే భయంవేసింది.

నవగ్రహశాంతి చెయ్యించాలని బ్రాహ్మణోత్తములందరూ సెట్టిని ప్రోత్సహించారు. యధావిధిగా జపాలు జరిగాయి. కొడుకు జబ్బు మాత్రం నయం కాలేదు.

అటువంటి అపత్సమయంలో రామయ్యసెట్టి ఏదో దేవుడికి మొక్కుకున్నాడనీ, ఆపద్బాంధవుడైన ఆ దేవుడనుగ్రహించి సెట్టికి పుత్రభిక్ష పెట్టాడనీ రాసి ఈ కథను నేను ముగించవచ్చు. కాని అది యధార్థానికి విరుద్ధం.

నిజానికి రామయ్యసెట్టి తన కొడుకు జతికి బాగుంటే, తనవీ, కొడుకువీ తల నీలాలు సమర్పిస్తానని ఏడుకొండలవాడికి మొక్కుకున్నాడు. రెండు రోజులపాటు జ్వరం తగ్గుమొగం పట్టింది. ఏమయినా దేవుడు దేవుడే అని పొంగిపోయాడు సెట్టి. అయినా కర్మఫలం అంటూ ఒకటి అందర్నీ వెంటాడుతూ ఉంటుంది కాదూ! దాని ఫలితంగా జ్వరం తగ్గిన మూడో రోజుకి సెట్టి కొడుకు మరణించాడు.

సెట్టిని ఓదార్చడానికి నేను వెళ్లాను. ఎంత మొక్కుకున్నా ఏమీ లాభం లేకపోయిందనీ, ఇంతకూ ఇది పూర్వజన్మంలో తాను చేసిన పాపానికి ఫలితమనీ అన్నాడతడు. పూర్వజన్మలనీ, ఉత్తర జన్మలనీ ఏవీ లేవని నేను వాడితో వాదించదలచుకోలేదు. తిరపతి వెళ్ళి, గుండు కొట్టించుకోవలసిన అవసరం తప్పిపోయినందుకు సంతోషించమని సలహా యిచ్చాను.

రామయ్యసెట్టి భయంతో గజగజ వణికిపోయాడు. ఏమయినా తల నీలాలు దేవుడికి సమర్పించే తీరుతానన్నాడు. అలాగే చేశాడు. చెయ్యకపోతే తన ప్రాణానికే ముప్పు వస్తుందని నా మిత్రుడి భయం!



# ‘తళతళలాడే’ తెలుపు కోసం




## సుప్రీమ్ డెట్ డిటర్జెంట్ ఉతికె బిళ్ల

కొత్తగా మెరుగు పర్చబడిన డెట్ బిళ్ళ, బజార్లో దొరికే
డిటర్జెంట్ ఉతికే బిళ్ళల కంటే ఎంతో మేలైనది.
మరికిని వదిల్చే శక్తికీ, నురుగు నివ్వడంలోనూ సువాసనలు
చిందించడంలోనూ దీనికి మరేదీ సాటికా లేదు.
వాడి చూడండి! తేడా ఏమిటో మీరే తెలుసుకోండి!
నిజమే, సుప్రీమ్ డెట్ బిళ్ళే
‘తళతళలాడే’ తెలుపు యిచ్చేది!

**దివ్యమైన తెలుపు,**
**డెట్ యొక్క తెలుపు**

Shilpi-DM 7A/76 Tel

ఒక్కొక్కడు అక్షరాలు మూడువేల పిడుగులలాగా వినవచ్చాయి. నీరసంగా కుర్చీ వెనక్కి జేరగిల బడిపోయాడు శివరావు.

"ఎటువంటి మాట చెప్పావ్ పరబ్రహ్మం?" అంటూన్న అతని కంఠం వణికింది. అప్పటి కప్పుడు ముఖంలో కళపోయి దీర్ఘకాల రోగిలాగా కన్పట్టాడు.

"శివరావ్, ఐయామ్ సారీ! ఏం చేయను? ఆడవాళ్ళు చాలా అవివేకంగా ప్రవర్తిస్తుంటారు ఒక్కొక్కప్పుడు. అందుకే నేను నిన్ను హెచ్చరించుదామని వచ్చాను. విచ్ఛిత్తికి అనువుగా లేదు ఉమ దేహస్థితి. అది ప్రాణానికే ముప్పు. అందుకే పెళ్ళి ఏర్పాట్లు చేయి!"

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

జరిగిన కథ :

శివరావు సౌమ్యుడు. పై మెరుగులకు కాక వ్యక్తిత్వాలకు విలువనిచ్చే వ్యక్తి. ఆయన భార్య మీనాక్షి అందుకు పూర్తిగా వ్యతిరేకం. వారికున్న ఇద్దరాడ పిల్లలలో పెద్దది ఉమ. గుణాలకు తల్లి పోలిక. తండ్రి గుణాలకు వారసురాలు సుందరి. ఆర్థిక చిక్కులలో ఉన్న గాయక కళాకారుడు సత్యమూర్తికి సాయం చేద్దామనుకున్న సుందరిని కసిరి కొట్టింది మీనాక్షి. మీనాక్షి అభ్యంతరం పెట్టినా సత్యమూర్తికి తన పర్సనల్ అసిస్టెంట్‌గా ఉద్యోగం ఇచ్చాడు శివరావు. సత్యమూర్తి తల్లికి ఆపరేషన్ కోసం పెద్ద మొత్తం సాయం చేశాడు శివరావు.సత్యమూర్తికి చక్కని బంగళా, ఫోనూ ఏర్పాటు చేశాడు. మీనాక్షికి ఇదేమీ నచ్చడం లేదు. శివరావుతో కలసి సత్యమూర్తి ఇంటికి వెళ్ళినప్పుడు, సత్యమూర్తి తల్లి చూపిన ఆదరభావమూ, ఆ తల్లీ కొడుకుల మధ్యగల అనుబంధమూ చూసి ముచ్చటపడింది సుందరి. సుందరి ఒంటరిగా స్కూటరుపై వెళుతుండగా అల్లరి చేయబోయిన రౌడీలను దండించి ఆమెను కాపాడుతాడు సత్యమూర్తి. సత్యమూర్తివైపు మరింత ఆకర్షితురాలవుతుంది సుందరి సత్యమూర్తితో షాపింగుకు వెళ్ళినందుకు సుందరిని నిలదీసింది తల్లి. కుమార్ విదేశాలకు వెళ్ళాడు. కుమార్ తిరిగి రాగానే ఉమకిచ్చి పెళ్ళి చేయాలని మీనాక్షి సంకల్పం. ఉమ జీవితంలోకి శంకర్ ప్రవేశించాడు. ఇద్దరూ బ్లూఫిలిమ్స్ చూశారు. అంతే' ఉమ తనను తాను మరిచిపోయింది. ఉమ గర్భిణి అని తెలవడంతో మీనాక్షి నెత్తిన పిడుగు పడినట్లయింది.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

మాట్లాడకుండా ఉన్మాదివలె చూడసాగాడు శివరావు.

"శివరావ్' ఏం చేస్తాం? ఒడుదుడుకులొస్తుంటాయి, తట్టుకోవాలి. తర్వాతి విషయం ఆలోచించు "

వెళ్ళిపోతున్న పరబ్రహ్మాన్ని పిచ్చిగా చూస్తూండిపోయింది సుభద్ర.

## 19

"మిష్టర్ సత్యమూర్తీ! బాస్ ఆఫీసులోనే వున్నారనుకుంటాను?" రిసెప్షనిస్ట్ ఆదుర్దాగా అడుగుతూన్నది ఫోన్‌లో.

"ఆఁ. ప్రైవేట్ రూంలో వున్నట్లున్నారు." కాగితాలు చూచుకుంటూనే యధా లాపంగా సమాధాన మిచ్చాడు.

"చాలసేపట్నుంచి చూస్తున్నాను. ఆయన ఒక్క ఫోన్‌కాలూ రిసీవ్ చేసు కోవడం లేదు ఆయన టేబుల్‌మీది మూడు ఫోన్‌లూ ఆర్డర్‌లో లేవా?" రిసెప్షనిస్ట్ గర్ల్ కంఠంలో ఆతృత అధికమైంది.

"వ్హాట్?" సత్యం ఖంగారుగా లేచాడు సీటులోనుండి. "వన్‌మినిట్. ఇప్పుడే చూస్తాను."

శివరావు ప్రైవేట్ రూంలో రిలాక్స్ కావడంలేదు. ఆఫీస్ గదిలోనే వున్నాడు. కాళ్ళు టేబిల్‌పై బారజాచి, కుర్చీలో అస్థవ్యస్థంగా మెలికలు తిరిగి శూన్యం లోనికి చూస్తున్నాడు. చెవులు గింగురుమంటూన్నట్లున్న ఫోన్ శబ్దాలు అతడిని చలింపజేయ లేకున్నాయి.

తానెన్నడూ చూడని ఈ బాధావ్యధిత హృదయం సత్యమూర్తిని కలవర పరచగా, తన ఉనికిని గమనింపజేయాలన్నట్లుగా చిన్నగా దగ్గాడు.

శివరావు ఈ లోకంలోనే లేనట్లు అలాగే వున్నాడు సత్యమూర్తి రాకను గమనించకుండా.

"బాబుగారూ."

"ఏమిటి? నన్ను డిస్టర్బ్ చేయవద్దు ఎవరూ. వెళ్ళు." ఇటు చూడకనే ఆదే శించాడు.

సత్యమూర్తి అలాగే నిలబడి వున్నాడు ఏమీ మాట్లాడలేక.

ఈసారి కొద్దిగా చూపులు యిటు త్రిప్పాడు శివరావు. "వెళ్ళు సత్యం. అందరూ వెళ్ళిపోయారా?"

"ఆఫీస్ అవర్స్ అయిపోయాయి కదండీ? కొందరు మాత్రం ఓవర్‌టైం చేసే వారు వున్నారు."

"రేపు చేస్తారులే. పంపించేయి అందర్నీ. నువ్వూ వెళ్ళు. నాకు చాలా ఆలస్య మౌతుంది. డ్రైవర్ని కూడా వెళ్ళిపోమను. ఫోన్ కనెక్షన్స్ యివ్వవద్దని చెప్పు. ఇప్పుడెవరితోనూ మాట్లాడను."

మరి మాటల కవకాశమీయనన్నట్లుగా రివాల్వింగ్ చెయిర్ గిర్రున గోడవైపు తిరిగింది

వేరుమార్గంలేని సత్యమూర్తి భారంగా కదిలాడు అతడి మనసులో కలవరం రేగింది.

'ఏమిటి శివరావుగారు ఈరోజు మరీ అంత ఏదో తీరని బాధలో వున్నట్లున్నారు! ఏమిటాయన బాధ?'

ఆలోచనలతో సతమతమౌతూనే, యజమాని ఆజ్ఞను అందరికీ విన్పించి ఆఫీస్‌నుంచి పంపివేశాడు. కానీ తాను వెళ్ళిపోవటానికి మాత్రం అతడికి మనస్కరించలేదు.

'ఇంతటి ఐశ్వర్యవంతుడూ అనునిత్యం ఎంతటి మనస్తాపంతో ఎంతటి ఒంటరితనంతో రోజులు వెళ్ళదీస్తున్నారు? ఎందరికో సుఖశాంతులను ప్రసాదించే ఆయనకు సుఖంలేదు; మనశ్శాంతి యిసుమంతైనా లేదు!'

యజమాని కొరకు వగస్తూ అలాగే ఓ గంట గడిపాడు.

బెదురుతూనే మరలా శివరావు గదివద్దకు వెళ్లాడు. ఏ అలికిడీ లేదు.

నెమ్మదిగా స్ప్రింగ్‌డోర్ నెట్టి చూచాడు.

శివరావు కూర్చున్న వైఖరిలో మార్పులేదు. అలసిపోయినట్లుగా కనులు మూసుకుని తల కొంచెం వెనక్కు ఆన్చి వున్నాడు.

నిశ్శబ్దంగా మరలిపోయాడు సత్యమూర్తి.

'ఏంచేయాలి! నేనేమి చేయగలను? కారణం అడిగితే ఆయనకు కోపం వస్తుందేమో?'

ఎల్లెడలా చీకటి అలుముకుంటూన్నది.

ఇంటివద్ద తల్లి ఎదురు చూస్తుంటుంది ఏకైక పుత్రుని రాక కొరకు.

నెమ్మదిగా ఫోన్ చేతికి తీసుకున్నాడు.

అటువైపు జవాబుగా తల్లి కంఠం వినవచ్చింది.

"అమ్మా, ఈరోజు ఎప్పుడు యింటికి వస్తానో నాకే తెలియదు. ఖంగారు పడవద్దు."

"ఏం నాయనా, పని అంత ఎక్కువగా వున్నదా?" భద్రమ్మ అడుగుతూన్నది.

కొంచం తటపటాయించిన సత్యమూర్తి చివరికి సత్యమే చెప్పాడు.

"శివరావుగారు యింకా ఆఫీస్‌లోనే వున్నారు. ఏవో బాధలలో వున్నారు. ఆయన వెళ్ళిపోమన్నారు కానీ, నేనే రాలేకుండా వున్నాను. వారిని యింటివద్ద దిగ విడిచాకనే నేను వస్తాను."

"మంచిది బాబూ, ఆయనకు మనమేమి చేసినా ఋణం తీర్చుకోలేము. దైవం వంటి ఆయనకు నువ్వు చేయగల ఏ పని అయినా వెనుకాడక, శక్తి వంచన లేకుండా చేయి."

"మంచిదమ్మా."

ఫోన్ యధాస్థానంలో వుంచి, ఏమైనా ఆఫీస్ కాగితాలు చూడాలని ప్రయత్నించాడు కానీ, సత్యమూర్తి మనసు ఆ పనిపై లగ్నం కాలేదు.

ఆ ఉదయం పోస్టులో వచ్చిన అపురూపమైన ఉత్తరాన్ని అప్రయత్నంగా బయటకు తీశాడు జేబులోనుండి.

సుందరి వ్రాసిన ఆ ఉత్తరంలో ఆమె సుందరవదనమే దోబూచులాడుతూ కనపడసాగింది అతడికి. అందలి ప్రతి అక్షరం ఆమె మృదులాంగుళులచే లిఖింపబడింది—అనుకొన్న అతడి మేను జలదరించింది. ఆమె రూపంవలెనే ఆ వ్రాతకూడ ఎంత అందంగా వున్నది!

"డియర్ మూర్తిగారూ,

అబ్బ—మిమ్మల్ని ఏమని సంబోధించుతూ వ్రాయాలా అనే సమస్యతోనే నాల్గు రోజులు గడిచిపోయాయి. ఈ ఉత్తరం అందిన తర్వాత నాల్గవరోజునాటికి మా బృందం అక్కడికి తిరిగివస్తాం. నిజానికి నా కిక్కడ పిచ్చెక్కినట్లే వున్నది. మధ్యలోనే వచ్చివేయాలని ఉన్నది కానీ, అనుమతి లేదుకదా? రోజూ, ఎప్పుడు వ్యవధి దొరికితే అప్పుడే మీ పాటలు వింటున్నాను. ఆ పాటలకు నేను పరవశించితే, మా స్నేహితురాండ్రంతా మతులు పోగొట్టుకుంటున్నారంటే నమ్మండి! 'ఎవరాయన? మాకు పరిచయం చేయవూ?' అని ఒకటే బ్రతిమిలాడ్తూంటే నా కెంత గర్వంగా వుందనుకున్నారు? కానీ—ఇప్పట్లో మిమ్మల్ని వాళ్ళకు నేను పరిచయం చేయను. మీరు జెలసీ అనుకోండి; అడబుద్ధి అనుకోండి, మరేమన్నా అనుకోండి, మరి ఎప్పుడంటారా?




'మా శ్రీవారు' అని గర్వంగా, అధికారంగా పరిచయం చేయగల మహద్భాగ్యం కలిగిననాడు!........

గుండెలు కొట్టుకొన్నాయి ఉత్తరం చదువుతూన్న సత్యమూర్తికి. ఉదయం నుండీ ఆ ప్రేమలేఖను లెక్కకు మించినన్నిసార్లు చదువుకున్నాడు. ప్రతిసారీ ఈ వాక్యం వరకూ వచ్చేసరికి అతడి హృదయ స్పందన ఎక్స్ప్రెస్ రైలు వేగంతో పోటీపడి, మిగిలిన భాగాన్ని చదవనేలేకపోతున్నాడు.

జాబు చివరకు పరుగిడిన నేత్రాలు పరవశంతో అవనతమౌతున్నాయి.

ప్రియ బాంధవి, సుందరి."

'నిజం, సుందరీ, ప్రియబాంధవివే, నా జీవన జ్యోతివే. కానీ....కానీ——....నేనంత అదృష్టవంతుడినా? నన్ను నీ అంత విశాల హృదయంతో నీ తలిదండ్రులు స్వీకరిస్తారా? మన ప్రణయం ఏమీ ప్రళయాలను సృష్టించదు కదా భగవాన్! ఎంత కొంటెవాడవు! నింగిలోని చందమామకూ నీటిలోని కలువభామకూ లంకె వేశావ్? అవనిపై అరవిందకూ అంబరాన ఆదిత్యునికీ అనుబంధం అన్నావే! ప్రేమికులమధ్య ఇంతింత దూరాలను సృష్టించి వినోదించుతావ్ కదూ? నీ ప్రేమపాశం విసరడానికి నేనే దొరికానా? క్షుద్బాధా పీడితునికి మరిగే పాయసపాత్ర నోటి కందించి వినోదించడం నీకే తగును.'

పలురకాల తలపోతలలో మునిగిపోయిన సత్యమూర్తికి కాలగమనమే తెలియరాలేదు.

తెలిసేసరికి చాలా ప్రొద్దుపోయినట్లు గమనించాడు. తాను ఊహాప్రపంచంలో మునిగి వుండగా గంటన్నర కాలం పరుగెత్తిపోయింది.

'శివరావుగారు యిప్పటికైనా యింటికి వెళ్ళే ప్రయత్నంలో వున్నారా? పాపం—యింటివద్ద ఆయన రాకకొరకు తపించేవారూ, ఆయనను ఆప్యాయంగా ఆదరించేవారూ లేరు. అందుకే అలా వున్నారేమో? ఆయన విసుక్కున్నా, కొంచం ఏమైనా మాట్లాడి ఆయన మనస్సు మరల్చి యింటికి తీసుకు వెళ్తాను.'

"సార్!" స్ప్రింగ్‌డోర్ తెరుస్తూ యథాలాపంగా పలుకరించబోయిన సత్యమూర్తి అదిరిపడ్డాడు. గుండెలలో రైళ్ళు పరుగెత్తుతున్నాయి.

కొద్ది క్షణాలు కాళ్లూ చేతులూ బిగుసుకుపోయి, నిలబడ్డ తావుననే అంటుకుపోయినట్లుగా వుండిపోయాడు, కనురెప్పలు కూడ కదల్చకుండా.

సత్యమూర్తిని ఆలా నిలబెట్టిన దృశ్యం0శివరావు విగతజీవిలా పడివున్న స్థితి: కాళ్ళూ చేతులూ వ్రేలబడి, మెడ కుర్చీ వెనుకకు కొద్దిగా వాలి వున్నది. దీర్ఘనిద్రలో వున్నట్లుగా మూసుకుని వున్నవి కనురెప్పలు.

---

కొద్దిసేపటికి తన అయోమయ స్థితినుండి తేరుకున్న సత్యమూర్తి ఆత్రంగా శివరావును సమీపించాడు రెండు అంగలలో.

"బాబూగారూ! బాబుగారూ!" దుఃఖం ముంచుకు వస్తూండగా పూడిపోయిన గళంతో పిలుస్తూ శివరావును అటు యిటూ కదిపి చూచాడు.

ఆ కదపటంలో శివరావు గుప్పిటనుండి నిద్ర మాత్రల సీసా క్రింద తివాచీ పైకి జారింది.

ఆత్రంగా నాడి చూచిన సత్యమూర్తి వదనం ఆనందంతో వికసించింది.

"బాబుగారూ, మీరు చనిపోవటానికి వీలులేదు." చెంపలపై అశ్రుధారలు కారిపోతూండగా, తన గోడు వినేవారు లేరని తెలిసి కూడా మరలా మరలా గొణుక్కోసాగాడు.

'ఏం చేయను? నేను ఒక్కడిని. ఎవ్వరూ సాయంలేరు.'

క్షణాలలో కర్తవ్య నిర్ణయం చేసుకున్నాడు. ఆవేశంలో అతడికి విపరీతమైన శక్తి వచ్చినట్లైంది. శివరావు భారీ శరీరాన్ని రెండు చేతులపై ఎత్తి ఎలా నడిచాడో మేడమెట్లు ఎలా దిగాడో తనకే తెలియదు.

"అయ్యగారికి బ్లడ్‌ప్రెషర్ ఎక్కువైంది" అని వాచ్‌మన్‌కి చెప్పి గబగబా కారు తానే బయలుదేర దీశాడు.

అదృష్టవశాత్తూ పరబ్రహ్మం తన నర్సింగ్ హోంలోనే వున్నాడు.

"ఏమిటి? శివరావ్? ఏమైంది?" అంటూ గాభరాపడి ప్రశ్నించాడు ఆంతటి డాక్టరూ.

రొప్పుతూన్న సత్యమూర్తి చెప్పాడు మధ్య మధ్యలో ఆగుతూ, "ఏమైందో? సాయంత్రం నుండీ పరాకుగా వున్నారు ఎవ్వర్నీ కలువలేదు ఫోన్ కాల్స్ రిసీవ్ చేసుకోలేదు ఇదిగో ఇది ఆయన చేతిలో "

అర్థమైనట్లు తల పంకించాడు పరబ్రహ్మం! వెంటనే వైద్యాని కుపక్రమించాడు. నర్సులూ, అసిస్టెంటూ అందరూ శివరావు బెడ్ వద్దనే తలొక పనిలో నిమగ్నులై వున్నారు.

"డాక్టర్‌గారూ' వారికేం ఫర్వాలేదుగా?" దీనంగా, కన్నీటిని అదిమి పెడుతూ అడుగుతూన్న సత్యమూర్తిని చూచి వేదాంతిలా నవ్వాడు డాక్టర్ పరబ్రహ్మం.

"ఆత్మీయులకు లేని ఆప్యాయత పైవాళ్ళకి వున్నది ఎంతపని చేశావ్ శివరావ్!" అనుకుంటూ తిరిగి తన పనిలో లీనమయ్యాడు.

సత్యమూర్తి తన ప్రశ్నకు జవాబు రాకపోవటంతో గ్రహించాడు శివరావు స్థితిని.

విషయం యింటికి తెలియ జేయాలికదా మరి?

మీనాక్షితో మాట్లాడటమంటేనే అతడికి బెరుకూ, కంపరంగా వుంటుంది.



'ఆల్ ఇండియా ఉమన్స్ కాన్ఫరెన్స్'ను అధ్యక్షురాలిగా మూడవ పర్యాయం ఎన్నికయిన శ్రీమతి లక్ష్మీరఘురామ్‌ను అభినందిస్తూ రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహమద్ అధ్యక్షతన హైదరాబాద్‌లో సభ జరిగింది. టి. యస్. కృష్ణానందం రచించిన 'లక్ష్మీరఘురామ్ జీవనస్రవంతి' పుస్తకాన్ని జస్టిస్ ఆవుల సాంబశివ రావు ఆవిష్కరించారు. రాష్ట్రపతి, లక్ష్మీరఘురామ్‌ను నూతన వస్త్రాలతో సత్కరిస్తున్న దృశ్యమూ, ప్రముఖ కార్టూనిస్టు సత్యం రాష్ట్రపతి నుండి మెమెంటో స్వీకరిస్తున్న దృశ్యమూ పై చిత్రాల్లో చూడగలరు.

---

కానీ తప్పదు మరి.

"ఎవరూ?" ఉమ కంఠం.

"నేను సత్యమూర్తిని మాట్లాడ్తు "

అతడి మాటలు పూర్తిగా వినసే లేదు ఉమ.

"ఏమిటి సంగతి?" విసుగ్గా అడిగింది.

"అమ్మగార్ని ఓసారి ఫోన్ దగ్గరకు పిలవండి."

"అమ్మగారూ లేరు, నాన్నగారూ లేరు." కోపంగా అంటూ పెట్టేసింది

'ఎంతటి అహంకారం రా తండ్రీ?' అనుకోకుండా వుండలేకపోయాడు సత్యమూర్తి.

మరలా ఫోన్ డయల్ చేశాడు.

"వాట్ నాన్సెన్స్? ఏమిటీ డిస్ట్రబెన్స్ మాటి మాటికీ?" ఉమ అరచింది రిసీవర్‌లో.

"మీ నాన్నగారికి చాలా సీరియస్‌గా వున్నది. పరబ్రహ్మంగారి ఆస్పత్రిలో వున్నారు. ఈ విషయం మీ అమ్మగారెక్కడున్నారో తెల్సుకొని తెలియజేయండి. సారీ!"

ఫోన్ పెట్టేశాడు సత్యమూర్తి.

మరలా వచ్చి శివరావుకు వైద్యం జరుగుతూన్న గది ఎదుటనే కూర్చున్నాడు మూసివున్న ఆ తలుపుల దెస బాధగా చూస్తూ, మనసున దైవప్రార్థన చేస్తూ.

'ఎందుకిలా చేశారీయన? ఏమంత ఆపద వచ్చిందో? ఎందుకంత విరక్తి కలిగిందో? లేక పరులకు ముఖం చూపలేనంత అవమానమేమైనా ఎదురైందా? ఛ. ఆయనకు ఎందుకెదురౌతుంది అటువంటి పరిస్థితి? వారిని అవమానించగల వాడెవడసలు?'

గది బయటకు వచ్చిన నర్సును ఆత్రంగా అడిగాడు. "ఎలా వున్నది శివరావు గారి స్థితి?"

"ఫర్వాలేదనుకుంటాను. అయినా నాకు తెలియదు ఇంతకూ ఆయన స్వజనం ఎవరూ రాలేదేమిటి?" అంటూనే గబగబా వెళ్ళిపోయింది తన పనిమీద.

'ఆయన స్వజనం!' బాధగా మూలిగింది సత్యమూర్తి మనసు. ఆ తల్లీకూతుళ్ల ఎప్పుడేమి రాచకార్యాలలో మునిగివుంటారో ఎవరికి తెలుస్తుంది? కానీ సుందరి వుంటే ఇలా జరిగేది కాదేమో! సుందరి తల్లివంటిదీ, అక్కవంటిదీ కాదు. ఇప్పటికి అతడికి సుందరి జ్ఞప్తికి తగిలింది. ఏం చేయను? సుందరికి తెలియజేయాలా? నిన్నెవరు

తెలియజేయమన్నారని ఎవరైనా తర్వాత నిష్ఠురంవేస్తే? వేయనీయి. ఫర్వాలేదు. బాధ్యత కొన్నికొన్ని పనులను చేయిస్తుంది. శివరావుగారితో ధైర్యంగా మాట్లాడగలదీ, ఆయన ఆలనపాలనలు చూచే వ్యక్తీ ఒక్క సుందరి మాత్రమే.

హాస్పిటల్‌లోని అటెండర్ నొకతడిని పిలిచి ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం పంపాడు సుందరికి వెంటనే బయలుదేరి రమ్మని.

'ఏం జరుగుతోంది? శివరావుగారెలా వున్నారు లోపల?'

మాటిమాటికి ఆ తలుపుల దెస చూస్తూ ఆందోళనగా అటు ఇటు పచార్లు చేస్తున్నాడు.

'తండ్రిపై ప్రేమ వున్నదైతే ఉమ ఈసరికి ఇక్కడ వచ్చి వాలకపోయేదా? ఆ మహాతల్లి మీనాక్షిగారు ఎక్కడ పెత్తనాలు చేస్తూన్నదో? కబురు ఆమెకు చేరిందో లేదో?'

అతడు ఊహించినట్లుగానే మీనాక్షి కైలాసం ఇంట అతడి భార్యతో ఇష్టా గోష్ఠిలో నిమగ్నమైవున్నది. నిజానికి పూర్వంకంటె ఆప్యాయత ఒలికించుతూ లోకాభిరామాయణం మాట్లాడ్తూన్న వ్యక్తి మిసెస్ కైలాసం. తప్పనిసరిగా వింటూ, మాట్లాడుతూ నిప్పుల పెనంమీద కూర్చున్నట్లు కూర్చున్నది మీనాక్షి, ప్రస్తుతం తాను చిక్కుకున్న ఆపదనుండి దాటటానికి ఏమైనా ఉపాయం దొరుకుతుందేమోనని లోలోన ఆలోచిస్తూ. కైలాసం కొడుకు అమెరికానుండి ఈమధ్య వచ్చే అవకాశమేమైనా వుందేమో అడగవలెననీ, అయితే అసలు విషయం మిసెస్ కైలాసం పసిగట్టకుండా ఏ ధోరణిలో అడగాలా అనీ ఆలోచిస్తూన్నది ఆమె.

మీనాక్షి వదనంలో ఎంత దాచినా దాగని అలజడినీ, పూర్వం లేని ఆ పర ధ్యాన్నతనూ గమనించలేని బుద్ధిమాంద్యంగానీ లేదు. ఆవులించితే ప్రేవులు లెక్కించ గల మిసెస్ కైలాసంకు.

"అన్నట్టు సుందరి కన్పించడంలేదు, ఊళ్ళో లేదా?"

"ఓ! మీకు చెప్పడమే మరచాను. వాళ్ళ క్లాస్‌వాళ్ళంతా మైసూర్, బెంగుళూరూ అనీ ఎక్కడెక్కడో తిరుగుతున్నారు. రావాలి వారం రోజుల్లో."

"అన్నట్టు మిసెస్‌రావ్, ఈ విషయం విన్నారా మీరు?" కుర్చీ మీనాక్షికి దగ్గరగా జరిపి, ఆమె చెవికి దగ్గరగా నోరుంచి గుసగుసలు పోయింది. "ఆ విశాలాక్షి కూతురులేదూ— ఎమ్మే చదువుతోందీ?"

"ఆఁ ఏమైందీ?"

"అవ్వాల్సిందే అయ్యింది!" అతి సంతోషంగా అన్నది. "ఆడింది ఆటగా పెంచడం నేర్చారు ఈమధ్య అందరూ ఆడపిల్లల్ని . పీకలమీదికి తెచ్చింది పరిస్థితిని. గుట్టుచప్పుడు కాకుండా మన కామేశ్వరి క్లినిక్‌లో అబార్షన్ చేయించేసిందట మొన్న!"

"మీకెలా తెల్సిందీ?" నీరసంగా అడిగింది మీనాక్షి.



ఈ అంపశయ్య మీద పడుకోలేను అర్జునా!!

"మన కామేశ్వరి నా దగ్గర ఏమీ దాచదుగా? అన్నీ చెప్తుంది.. అయినా పిల్లి కళ్ళుమూసుకుని పాలుత్రాగి తననెవరూ చూడటం లేదనుకుంటుందట! విశాలాక్షి కూతుర్ని వారంరోజుల క్రితం చూచినప్పుడే నాకు అనుమానం వచ్చింది. పిల్లల్ని కన్నవాళ్ళం— ఆమాత్రం గ్రహించలేమా?"

మీనాక్షి ముఖాన కత్తివాటుకు నెత్తురుచుక్కలేదు. విభ్రాంతితో మిసెస్ కైలాసందెస చూస్తూ వుండిపోయింది.

"నాకీ భయాలేం లేవుగా? మీరు ఆడపిల్లల తల్లికదా—ఎందుకైనా మంచిదని చెప్తున్నాను. ఉమ శంకర్‌తో చాలా చనువుగా తిరగడం చూచి ఇద్దరికీ పెళ్ళి ఔతుందేమో ననుకున్నాను. శంకర్‌గాడు ఎవతెనో ముడిపెట్టుకున్నాడని మిసెస్ సదాశివం గోలపెడ్తోంది. సుందరేమో బొత్తిగా బీదవాడైన ఆఫీస్ ఉద్యోగితో తిరగడం చూచాను. ఏమో—కాలం బాగులేదమ్మా. కాస్త స్వేచ్ఛగా వదిలేసరికి ప్రేమా, గోలా అనే జబ్బులు మొదలౌతున్నాయి ఈ కాలపు పిల్లలకు!"

మీనాక్షికి సర్వం గ్రాహ్యమైపోయింది. డాక్టర్ కామేశ్వరి తన రహస్యమంతా మిసెస్ కైలాసానికి చెప్పి వేసిందన్నమాట! అందుకే అలా కాకిలా అరుస్తోంది మిసెస్ కైలాసం. ఇంకా ఈమె ఎన్ని నోళ్ళకు మేత కలిగించబోతుందో ఈ వార్త చేరవేసి.

మిసెస్ కైలాసంలోని కాకి మీనాక్షి ఆలోచనలను చదివినట్టే అరుస్తోంది యింకా. "ఏదో నాగరికతా, శ్రాద్ధం అంటూ అనుకోవడంవరకే కానీ, నిజానికి ఎవడండీ— పిల్లలు పుట్టబోయేదానినీ పుట్టినదానినీ పెళ్ళిచేసుకోవటానికి ముందుకొచ్చే

మగాడు? ఇప్పుడా విశాలాక్షి కూతురికి పెళ్ళెలా ఔతుందో నేను చూస్తాగా! అమెరికాలో వున్న మావాడికి అదే వ్రాశాను— 'ఎన్నివేషాలైనా వెయ్యరా అబ్బాయ్— కానీ మెడకు ఏ ఉచ్చూ తగిలించుకోబోకు— పెళ్ళి అనేది కులమింటి కోతితోనే అవ్వాలి' అని! నామాట కాదంటారా మీరే చెప్పండి?"

మిసెస్ కైలాసం నోట యిటువంటి ధోరణి ఆశ్చర్యమే!

'కట్టూ బొట్టూ, మాటా నడకా మార్చుకొని తిరుగుతూ సాధించామనుకొనేది నాగరికత కాదు, కళ్ళు కప్పుకుపోయిన కండకావరం!' అని శివరావు అనేమాటలు చెవులతో గింగురుమంటూండగా కర్తవ్యమూఢయై కూర్చున్న ఆమెను మిసెస్ కైలాసం ఫోన్ దగ్గర్నుంచి పిలిచింది—

"చూడండీ ఉమ మీతో మాట్లాడాలట."

ఉమ చెప్తూన్న విషయం వింటూనే మీనాక్షి వదనం పాలిపోయింది.

'సీరియస్‌గా వున్నారా? పరబ్రహ్మం నర్సింగ్ హోంలోనా?'

తల తిరిగిపోతూన్నది ఆమెకు.

'సందేహంలేదు; పరబ్రహ్మం ఆయనకు అంతా చెప్పివేసి వుంటాడు! ఫలితంగా ఆయన బ్లడ్‌ప్రెషర్ అధికమై వుంటుంది!'

మీనాక్షిని జాగ్రత్తగా పరిశీలిస్తూన్న మిసెస్ కైలాసం అడిగింది. "ఏమిటండీ? ఏమైంది? ఉమ ఒంట్లో బాగుండలేదా?"

"బాగానే వుంది. నేను వెళ్తున్నాను. వారికి సీరియస్‌గా వుందట." పరుగెత్తినట్లే నడుస్తూనే మీనాక్షి సమాధాన మిచ్చింది.

"అయ్యో. పాపం. పదండి నేనూ వస్తున్నాను."

పరుగెత్తుతూన్న మీనాక్షి కాళ్ళకు సంకెళ్ళు పడినాయి.

"అబ్బే మీరెందుకండీ? శ్రమ " తడబడుతూ అన్నది. కైలాసం భార్య తన వెంటరావడం ఏమాత్రం యిష్టంలేదు మీనాక్షికి శివరావు ఏ కళన వున్నాడో— ఎటువంటి మాటల ఈటెలు విసురుతాడో తెలియదు. అవన్నీ ఈ డబ్బా వింటే యింకేమైనా వున్నదా? మరుక్షణంలోనే ఊరంతా విషవాయువులా వ్యాపించి పోదూ ఈ వార్త?

"అదుగో. చూడండి— అప్పుడే మీరెంత ఖంగారుపడ్తున్నారో? ఇటువంటి స్థితిలో మిమ్మల్నొక్కర్నీ వదిలేస్తానా?" అంటూనే మీనాక్షికంటె ముందు కారెక్కి కూర్చున్నది.

భర్త ఆరోగ్యాన్ని గురించిన ఆందోళనకంటే, ప్రస్తుతం ప్రక్కనవున్న ఈ నిప్పుల కొలిమిని గురించిన ఆరాటం అధికమైంది మీనాక్షికి.

'ఎలా వదల్చుకొనేది ఈ దెయ్యాన్ని?'

"కారు యింటికి పోనీయ్ డ్రైవర్ ముందు." అన్నది బాగా ఆలోచించి.

(సశేషం)



దీపావళి ప్రత్యేక సంచిక '76

మీరు మెచ్చిన రచయితలు!

మీకు నచ్చే కథలు!

(ఇరవైకి పైగా)

కార్టూనిస్టుల దీపావళి స్పెషల్ కార్టూన్లు

బాపు ముఖచిత్రం!

బ్నాపు, ఈశ్వర్‌లు జ్యోతికోసం ప్రత్యేకంగా

చిత్రించిన రెండు వర్ణచిత్రాలు

చంద్ర, జయదేవ్ కలిసి అందిస్తున్న కార్టూన్ కథ!

ఇవన్నీ

స్పెషల్‌గా దీపావళి జ్యోతి ప్రత్యేక సంచికగా

రూపు దిద్దుకొని

**200** పేజీలతో

దీపావళికి ముందే మీ ముందుంటాయి!

విడిప్రతి వెల: ఆరు రూపాయలు

మీ కాపీ ముందే ఏజంటు దగ్గర రిజర్వు చేసుకోండి!



# శ్రీశ్రీ నిర్వహించు పదబంధప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | ■ | 4 | | 5 |
| | ■ | 6 | 7 | ■ | 8 | | ■ | |
| 9 | 10 | ■ | 11 | | | ■ | 12 | |
| ■ | 13 | 14 | | ■ | 15 | 16 | | ■ |
| 17 | ■ | | ■ | 18 | ■ | | ■ | 19 |
| ■ | 20 | | 21 | ■ | 22 | | 23 | ■ |
| 24 | | ■ | 25 | | | ■ | 26 | 27 |
| | ■ | 28 | | ■ | 29 | 30 | ■ | |
| 31 | | | ■ | 32 | ■ | 33 | | |

ఆధారాలు నవంబర్ '76

## అడ్డం

1 తమిళ సినిమాలోకమిటీవల మారిందా? ఏముంది నిదర్శనం

4 ఇదంతా కృ. శా. అక్షయపాత్ర

6 సాధారణంగా తాత్పర్యానికి ముందు

8 ఆచ్ఛాదించు

9 ఇది పండుకాదు, కాయ!

11 వేలంలో వినబడతాయి

12 ముందూ వెనకా చూడకుండా ఆరంభించడు చూసి క్రీడించు.

13 సుకుమారి కోసం తిప్పుకో, మలిపుట

15 నవరుచులలో ఒకటి గరువమారినది

20 అరగనిదీ, తరగనిదీ! అందులో ఒక కెరటం

[illegible] బన్ని సద్య గాడికి ఇది
24 ఇది ఆడకపోతే ప్రమాదం
25 ఓరీ, తులువా! దాచిన పద్ధతులు బయట పెట్టు
26 కలత నిద్రలో మధురగాయని
28 నాంచారి?
29 దీనికి తకారం ఇతడు రాసేదవుతుంది
31 ఒక రాగ విశేషం
33 రేచుక్క, పగటిచుక్క

## నిలువు

1 తెలుగులో కవిత్వం
2 ఒకటీ, ఇంకొకటీ
4 ఇది ఇచ్చేవాడు వైద్యుడా?
5 1975
7 పునుక తాలుపు వేలుపు
8 తుదిలేని వడ్డీతో మొదలులేని రూకలు. ఫలితం ఒకపువ్వు
10 బాణం తిరుగుబాటు
12 ఇందులో సగం
14 మకార పంచకంలో మత్తు కలిగించేది
16 గాడిద చేసేదా
20 ఈ గుడ్డలు గొంతులు కొయ్యడానికా?
21 హరావో అంటే అయిపోతుందా?
22 స్త్రీలకిది సింగారమంటారు
23 లింగభేదంతో నిమిత్తం లేకుండా అందరూ కనేది
24 పరీక్షా? కెమిస్ట్రీలో కావచ్చు
27 అపరాధాలు
28 మెరీనా
30 ఆవిరి యంత్రంలో అగుపించే పువ్వు

## ఏకాక్షర పదాలు

3 అసమాప్త క్రియ
17 ఇంగ్లీషు కంపెనీకి హ్రస్వరూపం
18 చెయ్యి చతుర్థీ విభక్తి
19 తీసుకురా!
32 ఇన్ఫ్లుయెంజా

---

## అక్టోబరునెల 'పదబంధ ప్రహేళిక'కు సమాధానం:

అడ్డం. 1. వేడుక 4. తనలో 6. లిపి 8. నారి 9. కసి 11. లక్షలు 12. రాట్నం 13. గరిక 15. గురక 20. కాలువ 22. కానిది 24. వేలు 25. నిలువు 26. నంది 28. మేత 29. నది 31. వినను 33. శత్రువు.

నిలువు —1. వేదిక 2. కలి 4. తరి 5. లోగుట్టు 7. పిలక 8. నాలుగు 10. సిగ 12. రాక 14. రిపులు 16. రజని 20. కాలు 21. వనిత 22. కావున 23. దినం 24. వేసవి 27. దిటవు 28. మేను 30. దిశ.

ఏకాక్షర పదాలు — 3. క్రైం 17. డా 18. హ్రీ 19. రా 32. జో.

## నిబంధనలు మరువకండి!

ఎంట్రీలు కొట్టివేతలూ, దిద్దుబాటులూ లేకుండా జ్యోతిలోని పదబంధ ప్రహేళికలోనే నింపి పంపాలి. ఎంట్రీ పంపినవారి చిరునామా పదబంధ ప్రహేళిక వున్న పేజీలోనే పైన రాసి పంపాలి. ఆల్‌కరెక్ట్ ఎంట్రీలలో లాటరీవేసి ఒక్కరికి తెలుగు నిఘంటువూ, మరో పదిమందికి ఆ నెల జ్యోతి కాపీలు పంపబడతాయి. ఆల్‌కరెక్ట్ పంపిన పాఠకులందరి పేర్లూ జ్యోతిలో ప్రకటిస్తాము. ఎంట్రీలు చేరవలసిన ఆఖరు తేది 1-11-76.

# అక్టోబరు పదబంధ ప్రహేళిక - ఫలితాలు

అక్టోబరునెల పదబంధ ప్రహేళికకు ఒక్క తప్పు లేకుండా 53 ఎంట్రీలు వచ్చాయి.

లాటరీలో తెలుగు నిఘంటువు పొందినవారు

ఆర్. ఉష, కేరాఫ్ ఆర్. చలపతిరావు, 3/17, బ్రాడీపేట, గుంటూరు.

ఆల్ కరెక్ట్ పంపినవారిలో లాటరీ తీసి మరో పదిమందికి "జ్యోతి" నవంబరు కాపీలు పంపుతున్నాము. వారి పేర్లు ఇవి

1. ఎన్. ఆంజనేయులు, అవనిగడ్డ. 2. జి. యస్. ప్రకాశశాస్త్రి, విశాఖ పట్టణం. 3. ఎ. మహీపాల్ రెడ్డి, చేటుపల్లి. 4. టి. హరిప్రసాద్, సికింద్రాబాద్. 5. బి. ఎల్. మోహనరావు, వాల్తేరు. 6. ఎం. సత్యనారాయణమూర్తి, విశాఖపట్టణం. 7. ఎ. వి. కె. శర్మ, హైదరాబాదు. 8. వసుంధర, కావలి. 9. కె. గోపాలన్, మద్రాసు. 10. కె. శివరామకృష్ణన్, కర్నూలు.

ఆల్ కరెక్ట్ పంపిన ఇతర పాఠకులు:

1. పాశం కృష్ణారెడ్డి, గద్వాల. 2. పి. జానకీదేవి, హైదరాబాదు-3. పి.యస్. గోపాలకృష్ణ, మద్రాసు. 4. తాజీప్రసాద్, మద్రాసు. 5 బి. మధుసూదన్, హైదరాబాదు. 6. డి. కృష్ణప్రసాద్, హైదరాబాదు 7. ఎ. రామచంద్రన్ మద్రాసు. 8. వై. శకుంతల, కలకత్తా. 9. పి. సత్యనారాయణ, ఆదిలాబాద్. 10 వి. లక్ష్మి, జేపూర్. 11. ముద్దుకృష్ణ, హైదరాబాద్. 12. పుస్తకాల మోహనమురళి, కావలి. 13. ఎం. పాండురంగారావు, సికిందరాబాద్. 14. కె. ఆర్. మోహనశాస్త్రి, వైజాగ్ 15. డా॥ ఎం. శ్రీనివాసశర్మ, త్రివేంద్రం. 16. జి వి. కృష్ణారావు, హైదరాబాద్. 17. పి. శకుంతల, బెంగళూర్. 18. వి. గోపాలకృష్ణ, మద్రాసు. 19. ఎం. లక్ష్మణమూర్తి, హైదరాబాద్. 20. కె. నరసింహాచారి, హైదరాబాద్. 21. ఆర్. శ్రీమన్నారాయణ శర్మ, నల్గొండ. 22. పేరి విజయ, బొంబాయి. 23. కె. రవిబాబు, గుంటూరు. 24. ఎన్. సి. శ్రీనివాస్, హైదరాబాద్. 25. డా॥ పి. వి. సుబ్బారావు, త్రివేంద్రం. 26. టి. పూర్ణచంద్రరావు, నాగార్జునసాగర్. 27. ఎం. ప్రహ్లాద్, మహబూబ్ నగర్. 28. డా॥ వి. ఆర్. రావు, గుల్బర్గా. 29. వి. సత్యప్రసాద్, రాజమండ్రి. 30. పి. సరస్వతి, మలికిపురం 31 కె. రామానుజాచార్యులు, నల్గొండ. 32. కె. రామగురవయ్య, గుంతకల్. 33. కె. ఎ. సింగరాచార్యులు. హైదరాబాద్. 34. ఆర్. సోమేశ్వరరావు, హైదరాబాదు 35. ఇ. శ్రీనివాసులు, గుంతకల్. 36. పి ప్రసాద్ బాబు, హైదరాబాదు 37. పి. నాగేశ్వరరావు, వేజెండ్ల. 38. సి. కృష్ణప్రసాద్, విశాఖ పట్టణం. 39. జి. హైమవతి, హైదరాబాద్. 40. పి. సహజ, హనుమకొండ. 41. పి. రామలక్ష్మి, శ్రీకాకుళం. 42. భాస్కర అచ్చమాంబ, తిరుపతి.

# గ్రహణం పట్టిన రాత్రి

(3) నాగభైరవ ఆంజనేయులు

చలి మరీ విపరీతంగా వుంది. ఎముకల్ని కొరికేస్తుంది. మనసుని తొలిచేస్తుంది. రెండు పెగ్గులు త్రిబులెక్స్ రమ్ము పట్టించి, రూం కిటికీ తలుపులు బిగించి వేసినా చలి తగ్గటంలేదు శ్రీధరంకు ఏం తోచడంలేదు. నిద్రపట్టి చావటంలేదు. శరీరానికే కాదు—మనసులోనూ చలి మరీ దంచేస్తూంది.

"వింటర్‌లో ఒంటరిగా వెళ్ళబోకు" అన్న కవిత గుర్తొచ్చింది శ్రీధరంకు. అప్పుడెప్పుడో ఆ కవిత చదివినపుడు 'రెయిమ్‌కోసం వ్రాసిన పొయమ్' అని అనిపించింది శ్రీధరంకు. కవి ఆ మాట ఎందుకు చెప్పాడో ఇప్పుడు బాగా అర్థమవుతోంది శ్రీధరానికి.

మనసులో పుట్టి నరాలను తట్టుతున్న చలి గది తలుపులు మూస్తే పోతుందా— మదిలో తలపులు చల్లారాలిగాని, మంచం మీద వెల్లకిలా పడుకొని తిరగని సీలింగ్ ఫాన్‌వైపు చూస్తూ ఆలోచనల్ని మేస్తున్నాడు శ్రీధరం.

గదిలో ఒంటరితనం.

మదిలో తుంటరితనం మొదలవుతోంది.

కంటికి ఏవో రూపాలు లీలగా గోచరిస్తున్నాయి. ఒంటికి సుతిమెత్తని వేడి సోకాలి. ఆ వేడి ప్రతి నరానికి పాకాలి.

యవ్వనంలోనున్న మగాడికి — అందునా వంటరిగా—కోరికలు గుర్రాల్లా పరుగులు తీస్తాయ్. పెగ్గు పుచ్చుకున్నా, రగ్గు కప్పుకున్నా ఆ చలి వదిలేట్టు లేదు. మనసులో పెరుగుతున్న కోరికల తాలూకు చలి ఆగేట్టు లేదు.

శ్రీధరం లేచి గదిలో పచార్లు చేయసాగాడు. ఎంత ఆఫీసుపనయినా డిసెంబర్‌లో హైద్రాబాద్ వంటరిగా వచ్చి వుండాల్సింది కాదు. అర్థాంగి ఎంత అర్థించినా రెండు రోజుల పనేగా అని ఒక్కడే బయలుదేరాడు. రెండు రోజుల్లో పూర్తవుతుందనుకున్న పని నాలుగు రోజులయినా యింకా మొదలవలేదు. పెళ్ళికాక పూర్వం చలిరోజుల్లో శ్రీధరం చాలాసార్లు వచ్చాడు హైద్రాబాద్. పెళ్ళయాక రావటం ఇదే మొదటిసారి. అంతకుముందు తనని బాధించని చలి ఇప్పుడెందుకు కలవరపరుస్తుందో శ్రీధరానికి అంతుపట్టటం లేదు.

టేబిల్‌మీదున్న పాకెట్ అందుకొని గోల్డ్‌ఫ్లాక్‌కు లైటరును జత చేశాడు శ్రీధరం. లైటర్ వేడిని అందుకొని, ఆ వేడిలో కరిగిపోతూ మైమరచిపోతున్న సిగరెట్ తృప్తిగా పొగరూపంలో నిట్టూర్పులొదులుతున్నట్లు అనిపించింది శ్రీధరానికి. సిగరెట్‌ను కసిగా దూరంగా

విసిరేసి మంచంమీదికి చేరాడు శ్రీధరం.

మనసులో కోరికలు ఉధృతమవుతు న్నాయ్. అంత చలిలోనూ శ్రీధరం నుదుట చిరుచెమట పట్టింది. కాలింగ్ బటన్ నొక్కి లేచి వెళ్ళి తలుపు గడియ తీసి వచ్చాడు. రెండు నిముషాల్లో రూం బాయ్ తలుపు తోసుకొని లోపలకి వచ్చాడు. బొచంపట్టా వేసుకొని, గొంతు వరకు రగ్గు కప్పుకొని సన్నగా వణుకుతూ నడిమంచంలో కూర్చొని వున్నాడు శ్రీధరం. అతని వింత అవస్థకు రూం బాయ్ మనసులోనే ముసిముసిగా నవ్వు కున్నాడు.

"ఏం కావాలి సార్?" రూం బాయ్ అతివినయాన్ని వెళ్ళబోశాడు.

శ్రీధరంకు ఏం చెప్పాలో తెలియ లేదు. ఎలా చెప్పాలో అర్థం కాలేదు. అసహనంగా అటూ, ఇటూ కదిలాడు. గొంతు తడారిపోయినట్లయి, మాట పెగిలి రాలేదు.

రూం బాయ్ మళ్ళీ అడిగాడు.

"చాలా చలిగా వుందోయ్. నిద్రపట్టి చావటంలేదు ఏదైనా " తడబడుతూ కంపించే స్వరంతో మాటల్ని తుంచుతూ నసిగాడు శ్రీధరం. చూపుల్లోనూ, ముఖం లోనూ తన భావాన్ని వ్యక్తం చేయటానికి సాధ్యమయినంతవరకు ప్రయత్నించాడు.

రూం బాయ్ యిలాటి కేసులు చాలా చూశాడు. ఈ కేసుల్లో వాడి మనసు రేసు గుర్రాల్లా పరుగులు తీసి గెలుపును సాధి స్తుంది.

"అలాగే సార్ పది నిముషాల్లో పట్టుకొస్తా .. సరికొత్త సరుకు." అని చేతులు నలుపుకుంటూ నెలకెపి, గది కప్పుకేసి మార్చి మార్చి చూస్తూ అలానే నిలబడిపోయాడు.

శ్రీధరం వాడిని పరీక్షగా చూశాడు. పర్సులోంచి ఇరవై రూపాయల నోటు తీసి వాడి కందించాడు. 'కీ' ఇచ్చి వదిలిన బొమ్మలా రక్కున వెనుదిరిగి బయటకు పరుగుతీశాడు రూం బాయ్.

* * *

ఫ్లాస్క్‌లోని టీని కప్పుల్లోకి వంచి ఒకటి ఆమెకు అందించాడు శ్రీధరం. అందుకుంటుంటే వేళ్ళు కాలాయి. కప్పు తగిలో, అతని వేళ్ళు తగిలో మరి. శ్రీధరం మనసులో బెరుగ్గా వుంది. కుర్చీలో కూర్చొనివుంది ఆమె. మంచం అంచుమీద కూర్చొనివున్నాడు శ్రీధరం.

'మీ పేరు ' టీ సిప్‌చేస్తూ కప్పు అంచుమీదుగా ఆమె నుదుటిపై కదలాడు తున్న ముంగురులవైపు చూస్తూ శ్రీధరం అడిగాడు.

'అమృత ' చల్లని పెదవులు టీ వేడికి తెరుకుంటుండగా మెత్తగా పలి కింది.

"చాలా బావుంది." ఖాళీ కప్పును టేబిల్‌మీదుంచుతూ శ్రీధరం అన్నాడు.

" 'టీ'యా " సిగ్గుపడుతున్నట్టు తల కొద్దిగా వంచుకొని, పల్చగా నవ్వుతూ వాలుగా తలయెత్తి చూస్తూ చమత్క రించింది.

పల్చగా నవ్వుకున్నాడు శ్రీధరం.

"పేరు మీరు "కర్చీఫ్‌తో పెదాలు అద్దుకున్నాడు.

కనురెప్పలు పైకెత్తి తేటగా పరికించి



చూస్తూ "నాకేం బాగాలేదు" అంది పొడిగా.

"ఏమిటి?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు శ్రీధరం.

"నన్ను మీరు అంటూ గౌర వించటం. గౌరవం లేనివారిని గౌర వించటం తమను తామే అగౌరవపరచు కోవటమవుతుంది. ఇది గౌరవనీయులు చేయకూడదు."

"ఎదుటి మనిషిని గౌరవించటం సంస్కార లక్షణం."

"ఈ తప్పు పనికి సరికొత్తవాడిలా వున్నాడు" అని మనసులోనే అనుకొంది అమృత.

సన్నగా నవ్వింది. నవ్వి శ్రీధరం వైపు కొంటెగా చూసింది. చూస్తూ కైపుగా కనురెప్పలు వాల్చింది. ఆ కను రెప్పల మాటున ఏదో తీయని భావాన్ని వ్యక్తం చేసింది నేర్పుగా.

శ్రీధరం మనసు ఊగింది.
ఆనందంతో తులతూగింది.
తీయని ఆలోచన రేగింది.
నర నరంలోనూ సాగింది.

చిలిపిగా ఆమె కళ్ళలోకి చూశాడు. ఆ కళ్ళలో పండిన మైకాన్ని తూచాడు. ఆ కళ్ళవెనుక దాగిన మత్తును తలబోచాడు.

"అదిగో టేబిల్ మీద పర్సుంది. పర్సులో డబ్బుంది. నీకు కావల్సింది తీసుకో. సందేహించకు" ముద్దగా వున్నాయ్ శ్రీధరం మాటలు.

అమృత నిశ్శబ్దంగా నవ్వింది, విరిసిన మల్లెపూవులా, పరచుకున్న లేత వెన్నెల తావిలా.

శ్రీధరం లేచి బాత్ రూంలోకినడిచాడు. అమృత అతని పర్సును చేతిలోకి తీసు కొంది.

* * *

పది నిముషాల తర్వాత కుషీగా ఈల

వేసుకుంటూ బాత్‌రూంలోనుండి బయటకు వచ్చాడు శ్రీధరం. చుట్టూ ఒకసారి చూశాడు. కళ్ళు పెద్దవి చేసుకొని మరీ చూశాడు. అటూ యిటూ మళ్ళీ మళ్ళీ చూశాడు. సోఫా చాటున, మంచం అడుగున చూశాడు.

ఉహుం లేదు. అమృత ఆ గదిలో లేదు. శ్రీధరం మనసు కుతకుతలాడింది.

గుండె గొంతుకలోకి లాగినట్లనిపించింది. ఒళ్ళంతా వేడెక్కింది. పళ్ళ మధ్య క్రింది పెదవిని నొక్కిపట్టి, కుడి చేతి పిడికిలిని ఎడంచేతిలో రాస్తూ ఆలోచించాడు. తీవ్రంగా ఆలోచించాడు.

ఒక్క అంగలో టేబుల్ దగ్గర కెళ్ళాడు. టేబిల్‌మీద అమృత తెచ్చిన వానిటీబాగ్ లేదు. పర్సు యధాస్థానంలోనే వుంది. పర్సు చేతిలోకి తీసుకొని నోట్లు గబగబా లెక్కపెట్టాడు. సరిగ్గా వున్నాయ్.

ఆమె ఏమైనట్లు? ఎందుకు వెళ్ళిపోయినట్లు?

డబ్బుకోసం వచ్చిన మనిషి డబ్బు లేకుండా ఒట్టి చేతుల్తో వెళ్ళిపోయింది.

కారణం ఏమిటి?

ఆలోచిస్తూ శ్రీధరం టేబిల్‌మీదున్న వీక్లీవైపు చూశాడు.

"క్షమించండి. ఈ రాత్రి మీతో గడపలేను."

వీక్లీ అట్టమీద గబగబా గీకినట్లున్నాయి అక్షరాలు.

శ్రీధరానికి అంతా అగమ్యగోచరంగా వుంది. విచిత్రంగా తోస్తుంది. తనంటే ఆమెకు యిష్టం లేకనా! వెలయాలికి వెలతోనే పనిగాని యిష్టాయిష్టాలతొ ప్రసక్తి ఏం వుంటుంది!

ఆమెకు కావల్సినంత డబ్బు తనివ్వగలడు. కావల్సినంత తీసుకోమన్నాడు కూడా!

మరి మరి ఎందుకు వెళ్ళిపోయింది? డబ్బు లేకుండా ఎందుకు తిరిగి వెళ్ళిపోయింది.

ఎందుకు? ఎందుకు?? ఎందుకు???

శ్రీధరానికి పిచ్చెత్తినట్లయింది. ఆలోచనలు మనసుని నలిపేస్తున్నాయ్. సందేహాలు మెదడును పీక్కు తింటున్నాయ్. జరిగిన సంఘటనను ఏ విధంగానూ సమన్వయించుకోలేక పోతున్నాడు.

సిగరెట్ అంటించి గట్టిగా నాలుగు దమ్ములాగి విసుగ్గా పొగను గాలిలోకి వదిలి బలంగా కాలింగ్‌బటన్ నొక్కాడు. రూంబాయ్ పరుగున వచ్చి రూంలో శ్రీధరాన్ని ఒక్కణ్ణే చూసి అయోమయంగా నిలబడ్డాడు. శ్రీధరం అంత చిరాగ్గా ఎందుకున్నాడో, అసలేం జరిగిందోనని ఆలోచిస్తున్నాడు.

శ్రీధరం పర్సు తెరిచి కొన్ని నోట్లు వాడి చేతిలో కుక్కి "విస్కీ" అన్నాడు విసురుగా.

రూంబాయ్ అనుమానంగా చూశాడు.

"గెటిట్ యిమిడియెట్లీ" కోపంగా అరిచాడు శ్రీధరం.

*   *   *

ఖాళీ విస్కీ బాటిల్‌లో అగ్గిపుల్ల గీసి పడేసి మూత బిగించాడు శ్రీధరం. 'టప్' మంటూ వింత ధ్వని రావటంతో పక పకా నవ్వాడు శ్రీధరం. ఆ సీసా




వైపు చూస్తూ పెద్దగా పిచ్చిగా నవ్వాడు. అలా తెరలు తెరలుగా నవ్వుతూ కుర్చీ లోంచి లేచి తూలుతూ నడిచి వెళ్ళి మంచంమీద అడ్డంగా పడ్డాడు.

ఒకటి రెండు పెగ్గులకన్నా ఎక్కువ పుచ్చుకునే అలవాటు లేని శ్రీధరం మొదటి సారిగా ఆ రోజు బాటిల్‌ను పూర్తి చేశాడు.

ఆ మైకంలో శ్రీధరం కళ్ళకు అమృత వివిధ రూపాల్లో పంచ రంగుల్లో కనుపిస్తూ, కవ్విస్తూ అతన్ని మరీ రెచ్చగొట్ట సాగింది. ఆ ఆలోచనలతో అలానే మత్తులోకి ఒరిగిపోయాడు శ్రీధరం.

*　　*　　*

– సరిగ్గా అదే సమయానికి

అమృత తన గదిలో ఫోంబెడ్డు మీద వెల్లకిలా పడుకొని తన బాల్య స్నేహితురాలు రాధ ఫోటోవంక తదేకంగా చూస్తూ మనసులోనే భోరున ఏడ్చింది.

రాధ. నిరుపేదయైన తనను ప్రాణంతో సమంగా చూసుకున్న లక్షాధికారి ఏకైక పుత్రిక రాధ. తరచు ఆర్థికంగా ఆదుకుంటూ తన చదువు కొనసాగటానికి ఎన్నో విధాల సాయపడిన రాధ. అంతే కాదు . కనుపించే తన ఆరాధ్య దైవం రాధ.

రాధీ జీవితం వైకుంఠపాళి. కొందరు అదృష్టవంతులు వెంట వెంటనే నిచ్చెనలను ఎక్కుతూ కోరుకున్న గమ్యాన్ని చేరుకోగలుగుతారు. మరి కొందరు దౌర్భాగ్యులు అడుగడుగునా వద్దనుకుంటున్నా పాము నోళ్ళలో చిక్కుకుంటూ పాతాళంలోకికూరుకపోతుంటారు. ఈ రెండో కోవకు చెందిన దాన్నే నేను. చదువు పూర్తయాక ఉద్యోగ ప్రయత్నంలో నీకు దూరంగా వచ్చేశాను. ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరక లేదుగాని నా జీవితంలో వెలుగు నింపి తన జీవితం పండించుకుంటానన్నాడు

ఒకడు. నమ్మాను. అతని అర్ధాంగి నయ్యాను. సంవత్సరం నిండకుండానే అతనికి నామీద మోజు తీరిపోయి వెగటు ఏర్పడింది. రాధీ అతను మరి కొంద రితో కలసి పన్నిన వలలో నేను చిక్కు కున్నాను. పర్యవసానంగా పతితగా మారి పోయాను. ఈ కుళ్ళు జీవితం నుండి బయట పడాలని చాలాసార్లు ప్రయత్నిం చాను గాని—నా చుట్టూ వున్న ఈ కుళ్ళు మనుషులు నాకా అవకాశం ఇవ్వలేదు. నీ స్నేహితురాలు ఈ స్థితిలో వుందని తెలిస్తే, ఆ బాధకు నీవు తట్టుకోలేవు. అందుకే అందుకే నా వునికి నీకు తెలియజేయలేదు. నీ ఫోటో చూస్తుంటే, నిజంగా నిన్నే చూస్తున్నట్లు ఆనందంతో పొంగిపోతున్నా. నా జీవితంలో మధుర క్షణం యిదొక్కటే" ఎక్కడో దూరాన వున్న రాధతో తన బాధనంతా చెప్పుకొని మనసులోని బరువును కొంతవరకు దించుకొని బాధగా నిట్టూర్చింది అమృత.

ఫోటోను వెనక్కి తిప్పి చూసింది అమృత."శ్రీవారికి ముద్దులతో రాధి" అని వ్రాసుంది దాని మీద.

"రాధీ ఈ రోజు మీవారి చెంత నాస్థానంలో మరొకరు వుండి వుండచ్చు. కాని నేనుగా నీ జీవిత భాగస్వామిలో నీతోబాటు భాగం పంచుకోలేను" తడిసిన చెక్కిళ్ళను ముని వ్రేళ్ళతో అద్దుకుంటూ అనుకొంది అమృత.

* * *

తెల్లవారాక

పర్సు తెరిచిన శ్రీధరానికి అందులో తన పెళ్ళయిన తొలిరోజునుండి వుంటున్న తన భార్య రాధ ఫోటో అగుపించలేదు. అంతకు ముందు రోజు వరకువున్న ఆ ఫోటో ఎప్పుడు ఎక్కడ ఎలా పోయిందో శ్రీధరానికి అర్థంకాలేదు. ★

మినికథ:

# పాడు బుద్ధి

"న్నాణ్ రావ్!"

" "

"మిష్ట్ర నాణ్రావ్!"

" "

ఖంగుఖంగుమన్న ఆఫీసరు పిలుపులకి "యస్సార్!" అన్లేదు నారాయణ్రావు. సింపుల్‌గా లేచి, తాపీగా నడిచివెళ్ళి, ఆఫీసరు ముందు నిలబడి, చేతులేనా కట్టుకోకుండా, తలకాయేనా వంచకుండా- ఆఫీసరుకేసి విలన్‌లా చూసి, 'ఏవిఁటి కత?' అన్నట్టుగా నిలబడ్డాడు.

"వాటీజ్ దిస్ నాన్సెన్స్?" టైప్ కాగితాలు చూపించి ఆఫీసరు అన్నాడు.

"ఏ నాన్సెన్స్?" అన్నట్టు చూసేడు నాణ్రావ్ మాట్టాడకండా.

అవి నాణ్రావ్ టైప్‌చేసిన కాగితాలు. వాటినిండా రైట్లుకన్నా రాంగులెక్కువున్నాయి. అవి టైప్‌చేసినప్పుడు బద్ధకంగానూ, నిద్దరమొహంతోనూ వున్నాడు నాణ్రావు. ఎంచేతంటే నిన్న రాత్రి రెండోఆట యింగ్లీషిన్మా చూసేడు. అవి యింపార్టెంటు కాగితాలవ్వడంచేత ఆఫీసరుకి తిక్కరేగింది. అంచేత ఆ కాగితాల్ని పరపరా చింపేసి విసిరికొట్టేసి, నాణ్రావ్‌ని యింగ్లీషులో చెడామడా తిట్టేసేడు పావుగంటసేపు. అంత అశ్రద్ధ పనికిరాదన్నాడు. ఇంగ్లీషు నేర్చుకో అన్నాడు. ఒళ్ళు దగ్గరుంచుకో అన్నాడు. బుద్ధిగా పన్జేసుకో అన్నాడు. పో అన్నాడు. ఈ మాటలు ఆఫీసులో అందరూ వినేసేరు. నాణ్రావ్ దెబ్బతినేసేడు. విసురుగా ఒచ్చి సీట్లో కూచుని, తన కోపాన్నంతా టైప్మిషన్మీద చూపించి, టపాటపా మళ్ళీ టైప్‌చేసేసి ఆఫీసరు ముందు పారేసేడు.

ఆనక నాణ్రావు ఆఫీసరుమీద బోల్డు కోపం పెట్టేసుకున్నాడు. "ఎంత ఆఫీసరైతే మాత్రం? అంత పోజేస్తాడా? ఏం, నేనూ మనిషినేనా? సాటి ఉద్యోగినేనా? మరి తోటి ఉద్యోగిమీద పిసరంత ప్రేముండొద్దూ? కాస్త మర్యాదిచ్చి పుచ్చుకుంటే చచ్చిపోడు కదా?" అని మనసులో ఉడుక్కున్నాడు.

ఆనక ఆఫీసొదిలేసేక ఆఫీసరూ బోల్డు బాధపడ్డాడు నాణ్రావ్ గురించి. పాపం అతనూ చీవూఁ నెత్తురూ ఉన్న మనిషే కదా? ఆ మాటకొస్తే మనం మన బతుకుల్ని యిళ్ళల్లోకంటే ఆఫీసుల్లోనే ఎక్కువ భాగం గడిపేస్తాం! మరలాంటప్పుడు ఆఫీసుని కూడా ఓ కుటుంబంగా ఎందుకు భావించుకోం? తోటి వాళ్ళమీద ఓ కాస్త ప్రేమ, మర్యారా చూపిస్తే మన పరువేం తగ్గిపోదే! అని నిజంగా బాధపడ్డాడు."

అందుకే ఆ మర్నాడు రెండు స్ట్రాంగ్ కాఫీలు తెప్పించి, నాణ్రావుకి పిలుపెట్టి, "కూచో!" "తీసుకో!" అన్నాడు నవ్వి. "నిన్న జరిగింది మనసులో పెట్టుకోకు. ఏదో కోపంలో అంటూంటా. అంతే. అవన్నీ పట్టించుకోకూడ్దు" అన్నాడు ప్రేమగా.

"కాకా పట్టేస్తున్నాడు గురుడు! వాయ్? అందితే జుట్టూ, లేపోతే కాళ్ళూనూ. ఔను మరి! అంతకంటే ఏం చేస్తాడు పాపం? నాతో దెబ్బలాడితే తనకి పనెలా జరుగుతుంది పాపం?" అనుకున్నాడప్పుడు నాణ్రావ్—జాలిగా క్షమించేను పో అన్నట్టుగా.

—ఎల్బీ. శ్రీరామ్

# మిస్టర్ సంపత్ ఎం.ఏ.

మాదిరెడ్డి సులోచన

## జరిగిన కథ

ఆదర్శాలకూ, అవసరాలకూ జరుగుతున్న పోరాటంలో అవసరాలదే పైచేయి అని భావించక తప్పని పరిస్థితులలో చిక్కుకున్నాడు సంపత్ కుమార్. ప్రేమించిన సునీతి అపార్థం చేసుకుంది. సునీతి తండ్రి శివరాజుగారి బాకీ వెంటనే కట్టవలసి వచ్చింది. తల్లి అనారోగ్యం ఆందోళన కలిగిస్తూంది. న్యాయమార్గాన సంపాదన కోసం ప్రయత్నించి పరాజితుడవుతున్నాడు సంపత్. శివరాజుగారు పక్షవాతంతో మంచాన పడ్డారు. ఆయన కుటుంబం హఠాత్తుగా సంక్షోభానికి లోనైంది. అవసరాలకు లొంగాడు సంపత్. 'మేల్ ప్రాస్టిట్యూట్'గా తయారయేందుకూడా సిద్ధమై అస్తానా దగ్గర ఉద్యోగానికి చేరాడు. ఒకరోజు చాలామంది హైసొసైటీ యువతుల కోర్కె తీర్చేందుకు వారిముందు నగ్నంగా నిలబడేందుకు సిద్ధమయ్యాడు. ఆ దుస్థితినుండి సీత కాపాడింది. సంపత్ తల్లి మరణించింది. సీత అండగా నిలిచిందతనికి. సునీతికీ సంపత్ కూ మధ్య దూరం పెరిగిపోతోంది. తన మాట కాదన్నందుకు అస్తానా సంపత్ ను బెదిరించాడు. సీత సహకారంతో పెద్ద బిజినెస్ మాన్ అయ్యాడు సంపత్. సీత భర్త గుప్తాకు కంటిగింపుగా వుంది సంపత్ ను చూస్తేనే. సునీతి కుటుంబం ఆర్థికంగా అస్వస్థమైన స్థితిలో పడింది. సంపత్ తెలివితేటలతో వ్యాపారాన్ని అమిత వేగంగా వృద్ధిపరచాడు. గుప్తా స్వంత ప్రయోజనాలకోసం తమ వ్యాపారసంస్థను అప్రతిష్టపాలు చెయ్యడం సహించలేక అతన్ని వ్యాపార బాధ్యతల నుంచి తొలగించాడు సంపత్. గుప్త సీత దగ్గర మండిపడ్డాడు. తప్పని పరిస్థితిలో సునీతి ఇల్లు వేలం వెయ్యబడింది. సంపత్ ఆ ఇంటిని వేలంలో పాడి శివరాజుగారి పేర రాయించాడు. సునీతితో సఖ్యంగా మాట్లాడుదామని అతను చేసిన ప్రయత్నం విఫలమయింది. ఎలాగైనా సంపత్ ను వివాహానికి ఒప్పించాలని సీత చేసిన ప్రయత్నాలు ఫలించడంలేదు. శర్మ అనే వ్యాపారస్థుడి బిస్కట్ల కంపెనీ సంపత్ నే తీసుకోమని రికమండ్ చేయడానికి వెళ్ళిన సీత, ఆ బిస్కట్లలో కల్తీవల్ల ఎందరో పిల్లలు అనారోగ్యవంతులయిన విషయం తెలుసుకొని అప్ సెట్ అయింది.

"చెప్పండి. డబ్బేమయినా కావాలా?"

"దొంగనోట్లు పట్టుపడటంలో నా సాయముందని నాయుడు అనుమానించాడు. మా వివాహం జరుగుతుందో లేదో తెలియదు. నాకు ఉద్యోగం చాలా అవసరం. దయచేసి అనుమానంతో తీసివేయవద్దని ప్రార్థన."

"నెవర్! మీకు అలాంటి అనుమానం రాకూడదు. మీరు శత్రుపక్షంలోనివారయినా నాకేం భయంలేదు, మీరు నిశ్చింతగా ఉండండి. మీ అంతట మీరు వెళ్ళిపోతానని అంటే తప్ప తీసివేసే ప్రసక్తి లేదు." అన్నాడు.

"థాంక్స్!" అన్నది.

"నో మెన్షన్! ఒక్క విషయం. బాబు వైజాగ్‌లో ఉంటే నేను ఒక్కడిని వెళ్ళేవాడిని, వాడు సెలవుమీదున్నాడు. అందుకని ఈసారి ట్రిప్పులో మీరు రెండు రోజులు రావలసి ఉంటుంది. మీ నాన్నగారికి ఇబ్బందిగా ఉంటుందా?"

"ఫరవాలేదు. పనిమనిషి ఉంది. నేను వస్తాను." లేచింది.

"ఓ.కె." అతను అలసిపోయినట్టు కాళ్ళు ముందుకు చాపి, చేతులు తలమీద వేసుకుని విశ్రాంతిగా కూర్చున్నాడు.

"కంగ్రాచ్యులేషన్స్ " అన్నది. సహజంగా రాలేదు మాట.

"ఓ " ఆశ్చర్యపోయినట్టు ఒక నిముషం అని, వెంటనే నవ్వేసి, ధన్యవాదాలు చెప్పాడు.

సునీతి గబగబ బయటికి వచ్చేసింది. ఇల్లు ఎలా చేరిందో తెలియదు. మంచం మీద పడి, వెక్కి వెక్కి ఏడ్చింది. అక్కడే ఈజీచైర్లో కూర్చుని ఒక చేత్తోనే పేపరు పట్టుకుని జాగ్రత్తగా చదువుతున్న శివరాజు తండ్రి హృదయం మేలుకున్నది. ఈడ్చుకుంటూ, ఈడ్చుకుంటూ మంచం దగ్గరకు చేరాడు. మెల్లగా కూతురు తల నిమిరాడు.

"సునీ! ఏం జరిగిందమ్మా?"

జవాబు లేదు. అతను తన ప్రవర్తనకు కూతురు బాధపడుతుందేమో అనుకున్నాడు.

"పిచ్చి తల్లీ! లేమ్మా. ఇకమీదట నువ్వేం చెప్పినా వింటాను. నేను ఉద్యోగం చేస్తున్నాననే కదూ?" అతను బాధగా అడిగాడు. ఆమె అప్పటికీ లేవలేదు.

"చూడమ్మా! నిన్ను లేపి, ఓదార్చే శక్తి నాకు లేదు. ఒక్క చేయితో నీకు భారంగా బ్రతుకుతున్నాననుకుంటే, నువ్వూ ఏడిస్తే ఎలాగమ్మా? నేను నీ వివాహం చెయ్యలేని అశక్తుడను. నీపై కోపగించుకోవటం అమానుషమే అవుతుంది."

"నాన్నా!" లేచింది. అతన్ని హత్తుకుని వలవల ఏడ్చింది.

"ఊర్కో ఊర్కోమ్మా! నీ బాధ నాకు తెలుసు." ఒక్క చేత్తో కూతురు తల నిమిరాడు.

"నాన్నా! మన జీవితాలిలా యెందు కయ్యాయి?" వెక్కుతూనే అడిగింది.

"ఏమో తల్లీ! తెలిసీ, తెలియక ఎన్నో తప్పులు చేస్తుంటాం. అహఁ విషయం చెబుతున్నాను." అతనేదో వేదాంత ధోరణిలో మాట్లాడి, ఓదార్చాడు.

వైజాగ్ వెళ్ళేటప్పుడు కూడా గుప్త నాయుడు హెచ్చరించారు. వారికి ఈసారి తప్పక సంపత్‌కు ట్రాప్ చేయడానికి క్లూ తెస్తానని చెప్పింది. ఇద్దరూ కోరలు తీసిన పులుల్లా బుసలు కొడుతున్నారు. తను సంపత్ వివాహం చూడలేదు. సంఘంలో అతని స్థానం దిగజారితే ఛీ ఛీ తనేం ఆలోచిస్తుంది.

"మీరు శత్రుపక్షంవారయినా నాకు భయంలేదు." సగర్వంగా సంపత్ అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. అతనికి అంత ఆత్మవిశ్వాసమేమిటో!

మర్నాడు త్వరగా తయారై వచ్చింది. వైజాగు తీసుకెళ్ళవలసిన ఫైళ్ళన్నీ అతన్ని అడిగి సూట్ కేసులో పెట్టింది. అతని బట్టలు, కావల్సిన సామాన్లన్నీ సూరి సర్దేశాడు. రెండు సూట్ కేసులు కార్లో పెట్టారు. బ్రీఫ్ కేసు మాత్రం అతను చేతులో పట్టుకున్నాడు. ఇద్దరు కార్లో కూర్చున్నారు.

"మొదట సీతమ్మను చూడాలి." అన్నాడు. డ్రైవరు తలాడించేడు. కారు వెళ్ళి సీత ఇంటిముందు ఆగింది. సీత సబ్బునీటితో తలుపు కడుగుతుంది. అతని వెనకే దిగక తప్పలేదు సునీతికి

"పనివారు లేరా?" సంపత్ అడిగాడు.

"నువ్వేమో మా ఆయన వ్యాపారం పడగొడుతున్నావు. మరేదో పని చేసుకో వద్దూ! ఓ నువ్వా వచ్చావా? రండి రండి." నడుము చుట్టూ బిగించిన పమిట విడదీసుకుంది.

"సరే. నీ పని నువ్వు చేసుకో. పని మనిషి జీతం మిగిలితే మీ ఆయన సిగ రెట్లకన్నా పనికివస్తాయి." హాస్యంగా అన్నాడు.

"పిల్లలు లేరా? వాళ్ళను చూడక అయి దారు రోజులవుతుంది. నాల్గురోజులవరకు రాలేనేమో."

ఆమె పిల్లలను పిలిచింది. క్రిస్టమస్ సెలవులని ఇంట్లోనే ఉన్నారు. ఇద్దరూ వచ్చి, సంపత్‌తో మాట్లాడి తమ కోరి కలు చెప్పారు.

"ఓ. యస్, అన్నీ అలాగే తెస్తాను. మా డాలి నా పార్టనర్ కదా." ఆమె నుదురు ముద్దు పెట్టుకున్నాడు.

"మీ శ్రీవారే మంటున్నారు సీతా!"

"ఇంకా మా శ్రీవారిపై అనుమానం పోలేదా?" నవ్వింది. ఇద్దరికీ కాఫీ ఇచ్చింది. అప్పుడే బయటనుండి వచ్చిన గుప్త పిల్లలను పిలిచి యెంతో ప్రేమగా వారు ఫలహారము చేశారేమో అడిగాడు. వారిని తీసుకుని లోపలికి వెడుతుంటే సీత కళ్ళు తృప్తిగా మెరిశాయి. సంపత్ మాత్రం నమ్మలేకపోయాడు. గుప్త వెడుతూ వెడుతూ ఒక్కసారి సునీతి వంక హెచ్చరికగా చూచాడు. ఆమె తలవంచు కుంది.

"సంపత్ ఇలా రా" సీత పిలువటం విన్న సంపత్ ఆమె వెనుకాల మెట్లవరకు వెళ్ళాడు.

మొగుడూ పెళ్ళాం ఒకే ఆఫీసులో పనిచేస్తే...






"మెట్లు యెక్కే ఓపిక లేదుగాని, ఏమిటో చెబుదూ" సంపత్ కాస్త విసుగ్గా మరికాస్త చనువుగా అడిగాడు.

"పెళ్ళికి వెడుతూ పిల్లిని చంకన పెట్టుకు పోయినట్టు ఆ అమ్మాయి ఎందుకు తోడు."

ఎంత వద్దనుకున్నా సునీతి చెవులకా మాటలు వినిపించాయి. మనసు భగ భగ మండినా జవాబు చెప్పలేక పోయింది. ఆమె బాస్‌కు ప్రియమయిన వ్యక్తి.

"నీకు తెలుసుగా, నాకు పిల్లి శకునము అచ్చి వస్తుందని " నవ్వేసి వెనుదిరిగి సునీతి ముఖం చూచి ఆమె సీత మాటలు విన్నదని గ్రహించాడు. నెమ్మదిగా కౌరు దగ్గరకు వచ్చాడు. సునీతి అనుసరించింది.

## 37

సంపత్‌తో ట్రిప్పు ఇంత ఆహ్లాదకరంగా హాయిగా గడుస్తుందని ఎప్పుడూ అనుకోలేదు. అతని కనుసన్నలలో మెదిలే స్టాఫ్, అడుగడుగునా మర్యాదలు చేసే భాగస్వాములు, యెటు చూచినా అభివృద్ధి, ఉత్పత్తి కనిపిస్తున్నాయి. అదొక ప్లెషర్ ట్రిప్పుగా అనిపించింది. అధునాతనమైన హోటల్లో అతని కోసం కాటేజ్ బుక్ చేశారు. ఆమె కోసము గది ఏర్పాటు చేశారు. సమరసంగా ఉండి ఉంటే ఊహించలేక పోయింది. ఏ కబంధ హస్తం తమ సభ్యతను పిడికిట బిగించిందో! ఆలోచిస్తూ లేచి కూర్చుంది. రోజూ ఆ సమయానికి సంపత్ నుండి పిలుపు వచ్చేది. ఎవరొచ్చినా, ఏం చెప్పినా నోట్ చేసేది. ఈ రోజు పిలుపు రాలేదు. అతను చాలా మితంగామాట్లాడుతాడు. ఎవరయిన పొగిడినా చిరునవ్వుతోనే జవాబిస్తాడు. అతను అన్నీ మరిచి

పోయి నిశ్చింతగా ఉన్నాడా, చూడాలని కుతూహలం కల్గింది. ఒంటరిగా ఆలో చిస్తాడా! మెల్లగా తన గదినుండి బయ టికి వచ్చి, అతని కాటేజ్ వైపువెళ్ళింది. బెల్ నొక్క బోయింది. ఖాళీ కప్పులు తీసుకుని బేరర్ బయటికి వచ్చాడు. అతను ఆమెను ఎరుగును కాబట్టి చిరునవ్వుతో వెళ్ళిపోయాడు. తలుపు తీసుకుని ముందు గదిలో అడుగు పెట్టిందల్లా, బాబుగొంతు విని ఆగిపోయింది.

" నీ పుణ్యమా అని మా ట్రిప్ చాలా బావుందిరా, ప్రతిక్షణం లక్ష్మి నిన్ను జ్ఞాపకం చేసి అలక తెప్పించిం దనుకో."

"చిన్న పిల్లపై ఏం అలకిరా నీ మొహం!" సంపత్ గొంతు.

"ఒరేయ్ నీకు తెలియదురా అలక తరువాత కలయిక ఎంత కళాత్మకంగా ఉంటుందో "

"ఒరేయ్ బాబూ! నీ అనుభవాలన్నీ నాకు చెప్పకు. అన్ని పనులు సక్రమం గానే ఉన్నాయి. మనము ఇక బ్యాంకు వాళ్ళతో ఫేర్‌గా ఉండాలి."

"ఇప్పుడు వాళ్ళను మనము చేసిన మోసం ఏముంది!"

"ఒకే షేర్ సర్టిఫికెటు, ట్రిప్లికేట్లుగా చేసి మూడు బ్యాంకులో పెట్టటం మోసం కాదా! అప్పుడు డబ్బు అవసరము, సవ్యంగా అడిగితే పనులు జరుగవని ఏదో చేశాం. ఈ నెలాఖరులోగా అన్నీ తీర్చేయాలి."

"నీవు ఒట్టి భయస్తుడివిరా. మనము వడ్డీతో సహా డబ్బు చెల్లించాము కదా, చెల్లిస్తూనే ఉన్నాము.

"చెల్లించినా, చెల్లిస్తున్నా అది చట్టా నికి విరుద్ధమయినపనే కదరా " అన్నాడు.

"ఆ విషయము నా కొదిలేయి, నెలా ఖరు వరకు సెటిల్ చేస్తాను." బాబు హామీ ఇచ్చాడు.

"బి క్విక్, ఐడోంట్ వాంట్ టూ ప్లే విత్ ఇల్లీగల్ మాటర్స్! పార్టనర్‌గా తప్పించుకునే వాడిని, నేను మేనేజింగ్ డైరెక్టర్నిరా."

"ఏమంటుంది నీ స్వీట్ హార్ట్?" బాబు గొంతులో పరిహాసం ధ్వనించింది.

"హాట్ హార్ట్ అను. ఆమె ఒకరికి వాగ్దత్త. గౌరవనీయమయిన స్త్రీ. ఆమె గురించి యెంత తక్కువగా చర్చిస్తేఅంత మంచిది." సంపత్ తెంచేశాడు.

"వెళ్ళే లోపల ఒకసారి హార్బర్‌కు వెళ్లాలిరా."

"అలాగే వెడదాం. సునీతికి ఫోన్ చేస్తాను. ఆమెకు బోర్ కొడుతుంధేమో!" అన్నాడు.

"హార్బర్ కెందుకురా! ఆ అమ్మాయి నీపై ఓ నిఘా వేసి ఉందనే నా అను మానం. రాత్రి హైద్రాబాద్ నుండి వచ్చిన ట్రంక్‌కాల్‌లో మేం చెప్పిన విషయము ఏ మాత్రం అశ్రద్ధ చేసినా ఫలితం దారు ణంగా ఉంటుందన్నారట! ఆపరేటర్ చెప్పింది." సునీతి అక్కడ నిలబడలేక బయటికి వచ్చింది. తనపై ఓ కన్ను వేసి ఉంచారన్న మాట. గదికి వచ్చింది. అశాంతిగా అటు, ఇటు పచార్లు మొదలు పెట్టింది. తను విన్న సంగతి శ్రద్ధగా తన

మొగుడూ పెళ్ళాం ఒకే ఆఫీసులో పనిచేస్తే...









డైరీలో వ్రాసుకున్నది వణికే చేతులతో. కోటి కంఠాలు అన్యాయం అన్యాయం అని అరిచినట్టు అనిపించింది.

"ఇందులో నేను అన్యాయం చేసేది ఏంలేదు. అతడే అది చట్ట విరుద్ధమయిన పని అని అంగీంకరించాడు కదా." సమాధానపడింది.

ఫోన్ మ్రోగింది. హడావుడిగా డైరీ మూసి ఫోన్ యెత్తింది. అవతల సంపత్ ఉన్నాడు

"ఎస్...సార్ పదినిమిషాల్లో వచ్చేస్తాను. నథింగ్. . బాగానే ఉన్నాను అలాగే అలాగా!" అన్నది. ఫోన్ పెట్టేసి తయారయి క్రిందికి వచ్చింది. సాయంత్రపు సమయం డిసెంబరు వేళ, చలిగా ఉంది. బాబు, డ్రైవరు ముందు కూర్చున్నారు. వెనుక సంపత్ కూర్చున్నాడు, ఇవతలి ప్రక్కగా సునీతి కూర్చుంది. చలిగాలి వీచినప్పుడల్లా అతన్ని హత్తుకు పోవాలని బలమయిన కోర్కె కల్గింది. అప్రయత్నంగా వేసినట్టు అతని చేయిపై చేయి వేద్దామని, చేయి కదిపింది. చేతికి ఉన్న వజ్రపు ఉంగరం తళుక్కుమంది.

"ఛీ నాకు వ్యభిచారిణికి తేడాయే లేదు కాబోలు." అనుకుని చెయ్యి తీసుకుంది. హార్బరులో దిగేసరికి చలిగాలి ఉధృతంగా వీచింది.

"బాబూ! ఏదయినా ప్యాసింజర్ షిప్పు ఉంటే, మిస్ సునీతికి చూపించు. నేనొకసారి కార్లో ఆవైపు వెళ్ళి వస్తాను." చక చక నడుచుకుంటూ అతను వెళ్ళిపోయాడు. సునీతికి అతనితో వెళ్ళాలని ఉంది. అభిమానం చంపుకుని వస్తానని అడుగలేక పోయింది. బాబు వెంబడి ప్యాసింజర్ షిప్‌లోకి వెళ్ళింది.

వాళ్ళను చూస్తూనే ఒకతను యెదురు వచ్చి బాబుతో కరచాలనం చేశాడు. స్వంత

షిప్పులు ఏ కొద్దిమందికో ఉంటాయి. ఆ కొద్దిమందిలో సంపత్ ఒకడు కావటం అదృష్టం. దానివల్లే బాబుకు అతని పర్సనల్ సెక్రెటరీగా యెనలేని గౌరవం దక్కుతుంది. అతను ఓడలో పెద్ద ఆఫీసులా వున్న హాల్లోకి తీసుకుపోయి, ఫ్రిజ్ తీశాడు.

"నో నో. మిస్టర్ మల్‌హోత్రా! చాలా చలిగా వుంది. కూల్‌డ్రింక్స్ వద్దు." వారించాడు బాబు. అతను ప్యాసింజర్ గదులు చూపుతూ, డైనింగ్‌హాలు, కిచెన్‌లోకి తీసుకువెళ్ళాడు. అక్కడ నల్గురు వంటవారు వంట చేస్తున్నారు.

"సముద్రం మధ్యలో వుంటే, మీకు కూరలు, పండ్లు యెలా?" సునీతి ఆశ్చర్యంగా అడిగింది. అతను మెట్లమీదుగా క్రిందిభాగంలోకి తీసుకువెళ్ళి స్విచ్చి ఆఫ్ చేసి చిన్న గది తలుపు తీశాడు. అది కోల్డ్ స్టోరేజి. ఉల్లిపాయలు మొదలుకొని సమస్తం ఉన్నాయి. ఆ ప్రక్కనే నీళ్ళ స్టోరేజి చూపాడు.

"సాధారణంగా ఇవన్నీ ఒక ట్రిప్పుకు సరిపోతాయి. సరిపోకపోవటం అంటూ వుండదు. అలా యెప్పుడన్నా జరిగితే ఆగిన రేవులో కొంటాము." మల్‌హోత్రా చక్కని ఇంగ్లీష్‌లో అర్థం అయేలా చెప్పాడు. అసలే చలి, కోల్డ్ స్టోరేజ్ దగ్గర వుండలేకపోయింది. పైకి రాగానే రెండు కప్పుల వేడి కాఫీ తెచ్చారు.

"పాలు యెలా?"

"సాధారణంగా కండెన్స్‌డ్ టిన్స్. పౌడరు ఉపయోగిస్తాం." అక్కడనుండి లైబ్రరీకి వెళ్ళారు. లైబ్రరీ హాలు ముందుగుండావున్న మెట్లమీదుగా పైకి వెళ్ళారు. అక్కడ కంట్రోలింగ్ రూమ్ వుంది. దాని ముందున్న చిన్న ఓపెన్ వరండాలోకి వెడితే చుట్టూ పరిసరాలు కనిపించాయి. అనంతమైన ఆ సముద్రం తన్ను ఆహ్వానిస్తుం దనిపించింది. ఒక్కసారి అందులో దూకేస్తే అసలు సమస్యలంటూ వుండవు. సంపత్, నాయుడు, తండ్రి కట్టకట్టుకుని ఊరేగనీ. ఒక్కడుగు ముందుకు వేసింది.

"హల్లో చూడటం అయిందా?" సంపత్ వచ్చాడు.

"అయింది." బాబు వెనుతిరిగాడు. అతన్ని అనుసరించక తప్పలేదు. ముగ్గురు క్రిందికి దిగి కారు దగ్గరకు వచ్చారు. ఇద్దరు మనుషులు మరొకతన్ని పట్టుకు వచ్చి సంపత్ కాళ్ళముందు పడేశారు. అతను గజగజ వణికిపోయాడు.

"ఊఁ నువ్వేనన్నమాట నల్లమందు ఇంకా సరఫరా చేస్తుంది?" సంపత్ కళ్ళు అగ్నిగోళాల్లా వున్నాయి. అంత కోపంగా అతడిని యెప్పుడూ చూడలేదు. సునీతి అప్రయత్నంగా గుండెలమీద చేతులుంచుకుంది.

"మిగిలినవారు యెవరయినా ఇలాంటి పని చేశారా! వీడికి పట్టిన గతే పడుతుంది. బాబూ! వీడిని మూటకట్టి సముద్రంలో త్రోయించు." హూంకరించి కార్లో కూర్చున్నాడు.

"అయ్యా..." వాడు బావురుమన్నాడు.

"ఛీ ఛీ లక్షలుపెట్టి వ్యాపారం చేస్తున్నాం, గడిస్తున్నాం కాని జనంలో ఈ అల్పబుద్ధిని రూపుమాపలేక పోతు

మొగుడూ పెళ్ళాం ఒకే ఆఫీసులో పనిచేస్తే...




న్నాం. బాబూ, వాడి వెనుకాల ఇంకెవరున్నారో కనుక్కో. ఓ గుప్తను తీసివేస్తే మరో పదిమంది పుట్టుకువస్తున్నారు. ఛీ.... ఛీ.. "

డ్రైవర్ భయంగా చూస్తూ తలుపు వేశాడు. సునీతికి అతనిప్రక్కన కూర్చోవటానికి కూడా భయంవేసింది. ఫ్రంట్ సీట్లో కూర్చుని తలుపు తనే వేసుకుంది. కారు వచ్చి, హోటల్ గదిముందు ఆగింది. సంపత్ దిగి వెళ్ళిపోయాడు. సరాసరి ఫోన్ దగ్గరకు వెళ్ళి డయల్ చేశాడు. రెండు మూడు నంబర్లు చెప్పి మాట్లాడే వరకు సునీతి, అతని బ్రీఫ్‌కేసు బల్లమీద పెట్టి నిల్చుంది. అతను నంబర్ అడిగి. మౌత్‌పీస్‌మీద చెయ్యి పెట్టాడు.

"మిస్ సునీతీ! మీరిక వెళ్ళవచ్చు. రేపు ఉదయం ప్రయాణానికి సిద్ధంగా ఉండండి." అతను చెప్పాక నెమ్మదిగా బయటికి వచ్చింది.

"ఏమంటాడూ, గుప్త వెళ్లాక ఈ పని తారాచంద్ చేస్తున్నాడా? అతను హైద్రాబాద్‌లోనే వున్నాడా, గుడ్ .. గుడ్ బాబూ, బి కేర్ ఫుల్ " ఆమె అతని మాటలు వినిపించనంత దూరరకి వచ్చి. డ్రయివర్ని చేత్తో దగ్గరకు రమ్మని పిలిచింది. అతను వెళ్ళాడు.

"చూడు. ఇందాక ఆ హార్బర్‌లో ఉద్యోగిని నిజంగా చంపుతారా?"

"అబద్ధంగా కూడా చంపుతారేటి?"

"పరిహాసం కాదు. డ్రయివర్ నిజం చెప్పు."

"నిజం ఒక్క అయ్యగారికే తెలుసు. ఆడ్ని వదిలితే మిగిలిన అందరూ నేర్చుకుపోరూ?" అయ్యగారిదేం తప్పు లేదన్నట్టు మాట్లాడుతుంటే మండిపోయింది.

"సముద్రములో తోస్తేనే చస్తాడా?"

"సాక్ష్యంలేకుండా చస్తాడని కాబోలు. ఆ విషయాలన్నీ మన కెందుకు!" అతను

అటు తిరిగిపోయాడు. ఎంత మేక వన్నె పులి. అందుకేనా, నువ్వు శత్రుపక్షం దానివయినా పరవాలేదని తేలికగా అన్నావు. నేను కాలిలో ముల్లును అని తెలిసిన మరుక్షణమే మూటకట్టి సముద్రములో తోస్తావన్న మాట!' అనుకుని వణికిపోయింది.ఈ అయిదారు రోజులుగా అతని ప్రవర్తన, పరపతి చూచి కరిగిపోతున్న ఆమె హృదయము ఒక్కసారి ఘనీభవించి పోయింది.అలాగే కూర్చుండి పోయింది.

## 38

"చెప్పు చెప్పు సంపత్ నీ కంత డబ్బెలా వచ్చింది? మనం ఎంత నాటకం ఆడి, షేర్‌హోల్డర్స్‌ను సంపాదించింది జన్మలో మరిచిపోలేను. అదెంతో కూడా నాకు తెలుసు. మిగతా డబ్బు ఎక్కడిది?" సీత అపరకాళిలా నిల్చుంది అతని ముందు.

సంపత్ అనుకోని సంఘటనకు తెల్లబోయాడు. సీత తనతో అంత కోపంగా రోషంగా మాట్లాడడం ఇదే మొదటిసారి

"మాట్లాడు ప్లీజ్ "

"నువ్వు ఆవేశంలో ఉన్నావు. నేను ఏం మాట్లాడినా అపార్థం చేసుకుంటావు" అన్నాడు నిదానంగా.

"నన్ను నన్ను మభ్యపెట్టాలని చూడకు. నిజం చెప్పు."

"డబ్బు యెక్కడనుండి తెచ్చామో, తిరిగి ఇచ్చివేస్తున్నాము. నువ్వు అంతగా గింజుకోవలసిన పనిలేదు."

"ఇదేనా నువ్వు చెప్పే జవాబు!"

"సీతా "

"నన్ను బెదిరించవలసిన అవసరం నీకు లేదు. నాయుడు, గుప్తలాంటి వాడివే. నువ్వు ఆ నాడు దొంగనోట్లు కొట్టిస్తాను, దోపిడీలు చేస్తాను అంటే మేం ఆవేశంలో అంటున్నావనుకున్నాను, కాని నిజంగా చేస్తావనుకోలేదు ఛీ " చీత్కారం చేసింది.

"సీతా! ఆపు, కలలో మాట్లాడుతున్నావా?"

"కాదు, ఇప్పుడిప్పుడే వాస్తవము చూస్తున్నాను. నిన్ను నమ్మాను, నీలోని మంచితనాన్ని నిజాయితీని గుడ్డిగా ఆరాధించాను. నీలో ఓ విలక్షణమయిన పురుషలక్షణము చూచాను. చేయూతనిస్తే ఒక పరిపూర్ణ పురుషుడివి అవుతావని నా లాంటి అభాగ్యజీవులు ఇంకా పతనము కాకుండా రక్షిస్తావని ఆశించాను. నా ఆశను నిరాశ చేశా[illegible], నా నమ్మకాన్ని నేలమట్టంచేసి పూడ్చి[illegible]. దొంగనోట్లు వేశావు, తెలి[illegible] నాయుడిమీదికి నెట్టాలని చూచా[illegible]తడు తెలివిగలవాడని, అతడే నోట్లు [illegible]న్నాడని నన్ను నమ్మించి, అత[illegible]వదిలి అనుచరులంటూ అందరినీ [illegible]లకు అప్పగించావ్ "

"అబద్ధం పచ్చి అబద్ధ[illegible] నీ భర్తను ఇరికించాడు. అం[illegible] వేశాను" సంపత్ చెప్పాడు.

"చాలు చాలు నీ అబద్ధాలు నా భర్త ఒకప్పుడు దుష్టుడే [illegible] దుర్మార్గుడే కావచ్చు. ఇప్పు[illegible]యన మారారు. నువ్వు ఆయనపై ఏ నింద మోపాలని చూచినా నేను నమ్మను. స్మగ్లింగ్ చేసే అవకాశము నీకే వుంది. చేశావు. మూర్ఖుడయిన అస్తానాను ఇరికించావు."

మొగుడూ పెళ్ళాం ఒకే ఆఫీసులో పనిచేస్తే...




"సీతా ఆపు నీ ప్రేలాపన!" అరిచాడు.

"నువ్వు అరిస్తే భయపడదీ సీత! ఏం ప్రతి పని కలసి ప్రణాళిక వేశామే! కంపెనీలో పెట్టిన డెబ్బయి లక్షల లెక్క. ఆ డబ్బు వివరాలు నాకు చెప్పలేదేం? చెప్పలేవు ఇప్పటికయినా నీ అసలు స్వరూపం తెలిసింది. వస్తాను. రేపు లాయర్ వస్తాడు. నాకు రావల్సింది నాకు పడెయ్. ఇక జన్మలో నాకు ముఖం చూపకు."

"సీతా."

"సీత కాదు మిసెస్ సీతా గుప్తా! గుర్తుంచుకో" తోకత్రొక్కిన త్రాచు పాములా బుస్సుమంది. ఆమె చర చర బయటికి వెళ్ళింది ఒక్కక్షణం తరువాత అతను తేరుకున్నాడు. ఆవేశంగా ముందుకు దూకి, సీత చెయ్యి పట్టుకుని ఆమెను ఈడ్చుకొచ్చినట్టే తన గదిలోకి లాగి కూర్చోబెట్టాడు.

"ఏమిటీ దౌర్జన్యము!" సీత అతని చేయి విడిపించుకుని కూర్చుంది.

"దౌర్జన్యం కాదు సీతా గుండెలు దహించే బాధ. అన్నిరకాల బాధలను నీ చల్లని స్నేహముతో మరిచి పోయాను. నీలో తల్లిని, సోదరిని, ప్రియబాంధవిని, ఒక అపురూపమైన స్త్రీని చూశాను. నీ ఆప్యాయత ప్రసాదించిన అపూర్వమయిన శక్తితో ఇంత త్వరలో ఒక స్థాయికి చేరుకున్నాను కాని సీతా! ఇప్పుడు చేరుకున్న స్థాయినుండి చూస్తే నాకు కనిపించేదంతా అగాధమే." అతని కళ్ళు నిండుకున్నాయి.

ఆమె నిబ్బరంగా ఉంది. నీ కన్నీటితో నన్ను మభ్య పెట్టలేవు అనుకుంది.

"నేను చేరుకున్న స్థాయివల్ల నేను చాలా కోల్పోయాను. నాకేముంది! అను

రాగమయి అమ్మ పోయింది. తండ్రిలా ఆదరించిన శివరాజు దూరం అయారు. గువ్వలా గుసగుసలాడే, జవరాలు అపార్థం చేసుకుంది ప్రపంచమంతా నన్నో విచిత్రమయిన వ్యక్తిగా ప్రచారం చేసినా లెక్కచెయ్యలేదు. ఎందుకు? నీ చల్లని స్నేహం ఒక్కటి నాకు ఉత్ప్రేరకంగా పనిచేసింది " గబగబ వెళ్ళి అలమరా తీసి, ఒక ఫైలు తెచ్చి ఆమె ముందు పడవేశాడు.

"డెబ్భై అయిదు లక్షలు యెలా వచ్చాయో చూడు తెలుస్తుంది షేర్ సర్టిఫికెట్లు బ్యాంకిలో పెడితే, రుణం ఇస్తుంది ఒకొక సర్టిఫికెటుకు మూడు కాపీలు తీసి, మూడు బ్యాంకుల్లో పెట్టాను. అది చట్టరీత్యా నేరమే కావచ్చు డబ్బు క్రమము తప్పక కడుతున్నాను అది తీసి వేస్తాను. గుండెల మీద కుంపటిలా వుంది. నీతో యెందుకు చెప్పలేదని వాదిస్తే, నా దగ్గర జవాబులేదు. నీ హృదయము ఇప్పటికే చితికి శిదిలమయింది బరువు బాధ్యతలు నీ నెత్తిన రుద్దటం నా అభిమతం కాదు సీతా "

ఆమె మౌనంగా కాగితాలన్నీ పరిశీలించింది. ఆమె అన్నీ ఫైల్లో పెట్టింది.

"నన్ను క్షమించు సంపత్ " అన్నది మెల్లిగా.

"సీతా! నాకు ఇంకా గొప్పవాడిని కావాలని లేదు నా వైపునుండి గుప్త గారికి ఒక్కమాట చెప్పు అక్రమ సంపాదనకు ఆశించక, అడ్డమయిన వారి స్నేహం వదిలితే ఈ కంపెనీ, తదితర వ్యాపారాలన్నీ అతడికి అప్పగిస్తాను."

"వ్యాపారం అతనికి అప్పగించి నువ్వేం చేస్తావు? తెలిసిందిలే. మునగాల జమీందారువు అవుతావు అవునా?" కోపం గంభీరం పోయాయి, చిరునవ్వుతో అడిగింది

"నీ తలకాయ అవుతాను ఆ అమ్మాయికి నిన్ననే చెప్పేశాను

"ఏమని?" ఆదుర్దాగా అడిగింది సీత

"నా కిప్పుడప్పుడే వివాహము చేసుకోవాలని లేదని "

"సంపత్ చాలించు నీ పరిహాసాలు!" సీత కోపంగా లేచింది.

"నిజం సీతా! వివాహమంటే, అందచందాలు, హోదాయే కాదు మనసు కూడా "

"పెద్ద మనసున్న మొగాడు బయలుదేరాడు " కోపంగా పోబోయిందామె. సంపత్ చటుక్కున వంగి ఆమె పాదాలు అంటాడు.

"సంపత్!" ఆమె స్థాణువులా నిలబడి పోయింది

"ఆశీర్వదించు సీతా! నా జీవితంలో నువ్వు వెలిగించిన జ్యోతి ప్రకాశవంతంగా వెలగాలని

"సంపత్! నాకా అర్హత లేదు లేదు" ఆమె గొంతు పూడుకు పోయింది.

"అమ్మ తరువాత నా కెవరయినా పూజ్యనీయులున్నారంటే నువ్వే సీతా! రేపు మెజస్ట్రేటుగా వెడుతున్నాను. ఉదయం హడావుడి ఉంటుంది. నన్నాశీర్వదించి పంపు."

"సంపత్!" ఆమె మోకాలి మీద కూర్చున్న అతని తలపై చేయి వేసింది.




ఆమె కళ్ళు వర్షించాయి. నెమ్మదిగా అతని భుజాలు పట్టి లేపింది.

"జన్మలంటూ ఉంటే వచ్చే జన్మలో మనిద్దరం ఒకతల్లి కడుపున పుట్టాలని ఆశ...."

"సంపత్!....'' ఆమె అతని భుజం మీద తలవాల్చి వెక్కి వెక్కి ఏడ్చింది. అతను మౌనంగా తలనిమురుతూ ఉండి పోయాడు.

"సూరీ! అంకల్ ఏడీ?" బయట డాలి గొంతు వినపడింది. ఇద్దరూ దూరం జరిగి చెమర్చిన కళ్ళు తుడుచుకుని బయటికి వచ్చారు. సంపత్ పిల్లలు దగ్గరకు వెళ్ళాడు. సీత మళ్ళీ వెనక్కు వెళ్ళి పైళ్ళు బీరువాలో పెట్టి, తాళం వేసి వచ్చింది. సంపత్ పిల్లలు పడీ పడీ నవ్వుతున్నారు. పన్నెండేళ్ళ కూతుర్ని చూస్తూ గుమ్మంలోనే ఆగిపోయింది. విచ్చుకోబోయే మొగ్గలా వుంది. తను యెందుకూ విచారించవలసిన అవసరం లేదు. తనకూతురు అంది వస్తుంది. పదహారేళ్ళకు పెళ్ళిచేస్తే తను అమ్మమ్మ అయిపోతుంది. తన ఊహకు తనే నవ్వుకుంది. వాళ్ళున్న దగ్గరకు వచ్చింది.

"మమ్మీ! మేం అంకల్ ఇంట్లో వుండి పోతాము. మనింట్లో ఒఠ్ఠి బోర్! డాడి అసలు ఏం మాట్లాడతారో తెలియదు. హాయిగా నవ్వుతూ గడపవచ్చు" డాలి అడిగింది.

"మీ అంకల్ ఇంట్లో కూర్చుని మీతోనే ఆడుతాడా? ఈ రోజు ఇక్కడ రేపు విశాఖలో, యెల్లుండి లండన్...."

"చాలు....చాలు....ఇకముందు ఆ టూర్స్ అన్నీ తగ్గించుకుంటాను. ఇందాకే నీతో చెప్పాను కదూ!"

"ఊహ్! బావుందిగాని జరిగేలా చూడ

టమే కష్టం. మా డాలికి మరో నాల్గేళ్ళల్లో పెళ్ళి చేస్తాను."

"ఫో మమ్మీ!'' గారాబంగా తల్లి వడిలోకి వాలి, కొట్టుకోసాగింది.

"ఈజిట్! నీ కంటె అందకత్తె అవుతుందని భయమా!"

"కాదు, కాస్త, పెద్దదవుతే నీలా మొండిదవుతుందని భయము." అన్నది కూతురు జుట్టుతో ఆడుకుంటూ.

"డాలీ! నేను మొండివాడినా డియర్!"

"నో అంకల్! యు ఆర్ గ్రేట్, మమ్మే మొండి" డాలి లేచివెళ్ళి సంపత్ ప్రక్కన కూర్చుంది.

"సీతా! నీ కింత స్వార్థం పనికిరాదు. ఇద్దరు నీ కెందుకు? ఒకర్ని నాకు దత్తు ఇవ్వరాదూ?"

"నాయన్నాయన! పుణ్యం ఉంటుంది. ఇద్దర్నీ తీసుకో. హాయిగా దేశంమీద పడి తిరిగి వస్తాను. లేదా అమ్మ పేర్న నడుస్తున్న ఆశ్రమంలో వెళ్ళి ఉంటాను" అన్నది, తనకివతల ప్రక్కన కూర్చున్న టిల్లును కూడా సంపత్ పైపు నెడుతూ.

"ఆ మాట నాలుక చివర నుండి వచ్చిందా?"

"హృదయపూర్వకంగా చెబుతున్నాను. ఒక్క షరతు "

"ఏమిటో " పిల్లల భుజాలమీద చేతులువేసి అడిగాడు.

"వాళ్ళకీ ఇంట్లో తల్లి ప్రేమ లభ్యం కావాలి."

"ఏరా టిల్లూ! నీకు మమ్మి కావాలా, నేనా?"

"నువ్వే అంకల్ ." వాడు అతని భుజాన్ని ఆశ్రయించాడు.

"చూచావా, వాడికి నా దగ్గరే తల్లి ప్రేమ దొరుకుతుంది" అన్నాడుకొంటెగా.

"ఇదిగో, నీ కప్పదాట్లకు ఒళ్ళు మండుతుంది "

"అయ్యగారూ! వడ్డించమంటారా?" సూరి అడిగాడు.

"పద ఆకలి మండిపోతుంది."

"భలే భలే అంకల్! మమ్మి ఒళ్లు మండుతుంది. మీకు ఆకలి మండుతుంది" టిల్లు చప్పట్లు కొట్టి నవ్వాడు.

అందరూ లేచి భోజనాల బల్లదగ్గరకు వెళ్ళారు. సంపత్ మనసు ఏదో వెతుకుతూ వెళ్ళింది.

'సంపత్! మనిద్దరం వుద్యోగాలు చేసుకుని బ్రతుకవచ్చు.'

నిట్టూర్పు వదిలాడు.

"ఈ పిల్లలకు విపరీతమయిన గారాబం నేర్పి పాడుచేశావు" సీత విసుక్కోవటం విని ఇటు తిరిగాడు.

పిల్లలిద్దరూ ఒడ్డించేవరకు ఓపిక లేనట్టు బౌల్సులో వున్న పదార్థాలు తీసుకు తింటున్నారు.

"ఏమిటీ?" అంటూ తనూ ఒక కాకరకాయ ముక్క నోట్లో వేసుకున్నాడు.

"చాల్లెండి. ముగ్గురికి ఈ పూట మాడితే, చేతులతో పదార్థాలు ముట్టుకునేది కనిపిస్తుంది."

"అప్పుడు నోటితోనే తింటాము."

"ఆ! తింటాం" పిల్లలు అతని మాటలకు వంతపాడారు.

వారి నవ్వులతో పువ్వులవాన కురిసినట్టు అనిపించింది.

అందరూ ఆనందంగా భోజనాలకుపక్రమించారు. (సశేషం)

# మేలు

మేనల్లుడికి స్వయంగా ఫోన్ చేసి చెప్పినా తన అభ్యర్థికి ఉద్యోగం ఇవ్వలేదని డాక్టర్ మురళీధరానికి కోపం వచ్చింది. కోపంగానే మేనల్లుడికి ఫోన్ చేశారు.

"ఒరేయ్ వాసూ! మా వెంకట్రావు కొడుక్కి ఉద్యోగం రాలేదట. నీకు తెలుసా?"

"తెలుసు మావయ్యా!"

"తప్పకుండా చేస్తానన్నావే "

"ఏం చెయ్యను మావయ్యా! అంతా లంచాలు పుచ్చుకునే ఉద్యోగాలిచ్చారు."

"నువ్వు పెద్ద ఆఫీసరువి గదా! ఆ మాత్రం పలుకుబడిలేదా నీకు."

"ఎందుకు లేదు మావయ్యా? నా వాటా రెండు ఇచ్చారు. రెండేసివేలు పుచ్చుకుని ఉద్యోగాలిచ్చాను."

"ఒరేయ్ వాసూ! మాట ముఖ్యమా? డబ్బు ముఖ్యమా నీకు?"

"డబ్బు మావయ్యా!"

"ఛీ! కృతఘ్నుడా! మేలు చేసినవారికి ఇలా నమ్మకద్రోహం చెయ్యగూడదురా."

"నాకు నువ్వు ఏం మేలు చేశావు మావయ్యా?"

"అప్పుడే మర్చిపోయావురా. ఏడేళ్ళ క్రితం మీ నాన్నకు పక్షవాతం వచ్చినప్పుడు నా నర్సింగ్ హోమ్‌లో మూడు నెలలు ట్రీట్‌మెంట్ ఇచ్చి మళ్ళీ మనిషిని చేశాను గదరా. అదే వేరే డాక్టర్ అయితే వేలకువేలు ఫీజులంటూ వసూలు చేసే వాళ్ళు "

"అది మేలు ఎలా అవుతుంది మావయ్యా!"

"మరి దాన్ని ఏమంటారు?"

"కీడు."

"ఒరేయ్ ఒరేయ్ వాసూ!"

"నిజం మావయ్యా: నువ్వు ట్రీట్‌మెంట్ ఇచ్చి ఆయన్ని బ్రతికించి నన్ను చంపావు. ఈ ఏడేళ్ళపాటూ ఆయనకు మందులనీ, మాకులనీ కొంటున్నానా? ఇక పళ్ళరసాలు, సిగిరెట్లు, చాకలి ఖర్చు, మంగలి ఖర్చు, తిండి ఖర్చు లెక్కేసుకుంటే కనీసం సంవత్సరానికి రెండు వేలు అనుకున్నా, ఈ ఏడేళ్ళకీ హీనంగా పధ్నాలుగువేలు ఖర్చయిపోయాయి అదే మా నాన్నను జనరల్ హాస్పటల్లో జేర్పించివుంటే అప్పటికప్పుడే పోయి వుండేవాడా? నాకీ పధ్నాలుగువేలూ మిగిలేవి గదా. ఆ డబ్బుతో మా పెద్దాడ్ని యమ్.బి బి.ఎస్ "

డాక్టర్ మురళీధరం కోపంతో రిసీవర్ పెట్టేశాడు.

—వాణిశ్రీ



కంఠంనేని రాధాకృష్ణమూర్తి

# ప్రాచ్య నీసాలో పాశ్చాత్య సారాయి

రాజా నరేంద్ర ప్రసాదు, నేనూ చిన్నప్ప ట్ణించీ కలిసిమెలిసి చదువుకున్నాము. అతను బాగా ఉన్నవాడు కావడంతో కాలేజీ జీవితం పూర్తికాగానే పై చదువుకు అమెరికా వెళ్ళిపోయాడు. నేనేమో ఆర్థిక అండదండలు లేని కారణంగా ఈ దేశపు రొచ్చులో ముసురుతున్న ఈగల్ని తోలుకుంటూ ఇలా కూర్చుండిపోయాను. ఇట్లా అంటున్నానంటే నేనేదో అతని మీద ఈర్ష్య చెందుతున్నాననుకోవాల్సిన పనిలేదు. నిజం చెప్పాలంటే నేను సంతోషిస్తున్నాను. కారణం నరేంద్ర ప్రసాదే! లేకపోతే చెప్పండి, కన్న తల్లిదండ్రులు యాక్సిడెంటుకు గురై ఘోరమైన చావు చచ్చారంటే విచారించని పుత్రుడెవరన్నా ఉంటారా?? ఉన్నారు మరి! అట్లాంటివాళ్ళలో మా రాజా నరేంద్ర ప్రసాద్ ఒకడు. లేక అతనొక్కడేనేమో.

నిజానికి రాజా నరేంద్ర ప్రసాద్ రాజ వంశీకుడేమీ కాదు. అతని తల్లిదండ్రులకు రాజరికాలు అంతకంటేనూ లేవు. కాని వాళ్ళకు ఆస్తి మాత్రం బాగా ఉంది. ఉన్న ఒక్క పుత్రుడూ మహారాజులా బ్రతకాలనీ, లోకంచేత అతను 'రాజా'గా పిలవబడాలనే మురిపెంతోనూ వాళ్ళతనికి ప్రత్యేకంగా ఆ పేరును పెట్టుకున్నారు. కన్నబిడ్డ భవిష్యత్తు విషయంలో తమ బాధ్యతను చాలా సీరియస్‌గా తీసుకునే సంస్కారవంతులు వాళ్ళు. అందుకనే కొడుకును ఆరేళ్ళపాటు విడిచి ఉండటం తమకు దుర్భరం అయినా అతను గొప్ప విద్యావంతుడు కావాలనే ఆకాంక్షతో తమ మనసుల్ని షోఫపెట్టుకుంటూనే విదేశాలకు పంపారు. కాని అతను తిరిగి వచ్చే రోజున అతణ్ణి రిసీవ్ చేసుకోవటానికి విమానాశ్రయానికి వెళ్తుండగా దారిలో కారు యాక్సిడెంటుకు గురై వాళ్ళు అక్కడికక్కడే మరణించారు, కొడుకును చూడకుండానే. రాజా నరేంద్ర ప్రసాదుకిది పెద్ద షాక్‌గా తగిలివుండవచ్చనను కున్నాను కాని నా ఊహ తప్పయింది.

"నేనంతగా విచారించటంలేదు బ్రదర్!" అన్నాడతను.

నమ్ముతారా మీరు? నేనయితే నమ్మనన్నాను. ఎందుకా అబద్ధాలు? అన్నాను.

"వెల్ " అతనన్నాడు. "ఈ లోకం స్వార్థంచేత నడపబడుతోందంటే నమ్మేవాళ్ళలో నేను ప్రథముణ్ణి. ఐ మీన్ సొలిప్సిజమ్ గురించి మాట్లాడుతున్నాను. మానవుడు ఎంతసేపూ తన కోసమే బ్రతుకుతుంటాడు. అంతకు మించి వల్లించబడే మాటలన్నీ ఉత్త అబద్ధాలు. లోక వంచనకోసం ఉద్దేశించబడ్డ కపట

"అయితే?"

"అదే చెప్పబోతున్నాను. ఈ సెంటిమెంట్సు, మానవుడు ఏర్పరచుకున్న ఈ దుర్బల అనుబంధాలు, ఇవన్నీ ఉత్త ట్రాష్! ఇదో పెద్ద వ్యాపార ప్రపంచం. ప్రతి విషయంలోనూ లాభనష్టాల బేరీజు మీద నడుస్తుంది తనకు లాభం కలిగించే వస్తువుల్నీ, ప్రాణుల్నీ ప్రేమించటము, నష్టము కలిగించే జీవుల్నీ, మనుషుల్నీ ద్వేషించటమూ జరుగుతోందిక్కడ. ఉదాహరణకు తల్లిదండ్రులు తమ బిడ్డల్ని మాత్రమే ఎందుకు ప్రేమిస్తున్నారంటావు? వేరేవాళ్ళ బిడ్డల్ని తమ బిడ్డల కంటే అందంలోను, తెలివిలోను, మిగతా అర్హతల్లోనేమి అనేక రెట్లు అధికులైన వాళ్ళని ఎందుకు ప్రేమించలేకపోతున్నారంటావు?? ప్యూర్ బిజినెస్! షీర్ సెల్ఫిష్‌నెస్!! ఆ బిడ్డలు తమ ప్రతిబింబాలు, తమలోంచీ తమ రక్తంలోంచీ వచ్చిన వాళ్ళు, తమలోని అణుభాగం వేరవ్వగా ఏర్పడి పెరిగి పెద్దయినవాళ్ళు, అనగా



తామే కాబట్టి, అంటే తమనే ప్రేమించు కుంటున్నారు వాళ్ళు. ఈ బిడ్డలు వ్యక్తిగతంగాను, ఆత్మగతంగాను, సాంఘికంగానూ తమకో అండని, తమకింత పుష్టినీ చేకూర్చుతున్నారు కాబట్టి ప్రేమించుతున్నారు. ఇది పచ్చి వ్యాపారసూత్రం కాదంటావా?? నే నట్లా ఉండదల్చుకో లేదు "

నాకో సంగతి అర్థమయింది. విదేశాలకు వెళ్ళి నా మిత్రుడు బాగా మారిపోయాడు. మనస్సును అంతగా మొద్దుపరచగలగటం ఒక్క యోగులకు, కసాయివాళ్ళకు మాత్రమే సాధ్యమవుతుంది. ఇతనేవైపు మొగ్గుతున్నాడో గాని.

"కాని మిత్రమా," నే నన్నాను. "ఆ స్వార్థ సిద్ధాంతంతో చూసినాగాని నువ్వు విచారించాలేమో నీ తల్లిదండ్రులు చనిపోయినందుకు'? వాళ్ళు నీకు మూలజీవులు, నీ జన్మకు కారకులు. నీ శరీరానికి ఆది శరీరాలు అయిన—వాళ్ళు, ఈ లోకాన్ని విడిచిపెట్టారంటే నీకు నష్టమే కదా! అలా చూచినా నీకు బాధ కలగాలే' "

"లేదు లేదు, నువ్వు గమనించే ఉంటావు. ఎక్కడ చూసినా వ్యక్తిపరులైన బిడ్డలకు కన్నవారెప్పుడూ ఆటంకంగాను, అభివృద్ధి నిరోధకులుగాను ఉంటుండటం' కొత్త నీటికోసం పాతనీరు ఒకింత చోట ఇస్తుండటం అవసరం. ఐ రిగ్రెట్ ఫర్ నథింగ్'!"

హారిబుల్' ఈ లోకంలోని ప్రతి మనిషికీ వేపకాయంత వెర్రి ఉంటుందంటారు. కాని ఇతనికి మాత్రం తాటికాయంత తయారయినట్లుంది . .

రాజానరేంద్రప్రసాద బాగా అస్తిపరుడని ముందే చెప్పాను. ఊరి చివర అతనికో పెద్ద అందమైన భవనముంది. దాని చుట్టూ ఎత్తాటి ప్రహరీ ఉంది. గేటు తీయగానే రెండువైపులా అందమైన గార్డెన్ కనిపిస్తుంది. మధ్యనుంచి ఉన్న విశాలమైన సిమెంటు దారి కార్లు పోవటానికి కూడా పనికి వస్తుంది. అమెరికా నుంచి తిరిగి వచ్చిన వెంటనే అతను ఊళ్ళోని పెద్దల కందరికీ పెద్ద విందు చేశాడు. అంతే కాదు, అప్పటించీ నెలకు రెండు సార్లు పార్టీలు చేయటాన్ని అలవాటుగా పెట్టుకున్నాడు ఆ పార్టీలు జరిగిన్నాడు ఎన్ని కోళ్ళ తలకాయలు తెగుతాయో, ఎన్ని సీసాల మూతలు ఎగిరి అవతల పడుతూంటాయో చెప్పలేము. అతను మళ్ళీ పార్టీ ఎప్పుడు ఇస్తాడా అని ఊళ్ళోని ముఖ్యులు తరచుగా తహతహలాడుతుంటారంటే అతిశయోక్తి కాదు. అతను ఇలా దుబారా ఖర్చులు చేయటం నాకు నచ్చేది కాదు. మిత్రుడిగా అదే అన్నాను అతనితో.

"ఇదంతా నేను వాళ్ళమీద ప్రేమతోనో ఇష్టంతోనో చేస్తున్నాననుకుంటున్నావా?" నవ్వాడతను. "లేదు లేదు నిజం చెప్పాలంటే నాకీ మనుషులమీద అపారమైన అసహ్యము జుగుప్స నిండుకొని ఉన్నాయి. బజారులో వస్తువుల్ని కొన్నట్లు వీళ్ళ మనసుల్ని మనం డబ్బుతో కొనవచ్చు. ఒక కోటీశ్వరుడు లక్షరూపాయలు దానం చేయటాన్ని, పూటకి గతిలేని పేదవాడు ఒక రూపాయి దానం చేయటంతో పోల్చదలిస్తే వీళ్ళ కంటికి లక్షరూపాయలు




దానం చేసినవాడే గొప్పగ అన్తాడు. అట్లాంటివాళ్ళు వీళ్ళు! వీళ్ళుత్త మూర్ఖులే కాక జిత్తులమారి నక్కలు కూడా. వీళ్ళను నాకు మానసిక బానిసలుగా చేసుకోవటానికి నాకున్న అంతటి ఆస్తిలో ఓ కాస్త భాగాన్ని మాత్రమే ఉపయోగిస్తున్నాను. అది తప్పుగాని తెలివితక్కువతనం గాని అంటావా??"

కొద్దిసేపాగి అతను మళ్ళీ అన్నాడు.

"ఒకోసారి విందు సమయంలో నాకే మనిపిస్తుందో తెలుసా? ఒక చేతిలో లక్ష రూపాయల నోట్లకట్టను ఉంచుకుని ఎవరు ముందుగా నా అరికాళ్ళు నాకితే వాడికి ఆ కట్టను ఇస్తానంటే వాళ్ళలో వాళ్ళు ఆ పనికోసం ఎట్లా కాట్లాడుకుంటారో చూడాలనిపిస్తుంది చూస్తుండు, ఏనాడో నేను వీళ్ళ మొహాన తుపుక్కున ఊస్తాను, వాళ్ళు నవ్వుతూ దాన్ని తమ జేబుగుడ్డలతో తుడుచుకుంటారు. ఆ రోజు ఎక్కువ దూరంలో లేదనిపిస్తోంది "

నిజంగానే ఆ రోజు ఎక్కువదూరంలో లేకపోయింది. ఒకసారి రాజా నరేంద్ర ప్రసాద్ అందరికీ ఆహ్వానాలు పంపాడు. తాను బ్రహ్మాండమైన విందును తలపెట్టినట్లూ, ఈసారి అంతా భార్యాసమేతంగా రావాలనీ, అలా వచ్చిన ప్రతి వారికీ అత్యంత విలువైన బహుమతి ఒకటి ఇవ్వబడుతుందనీ. అందరికీ తెలుసు, రాజా నరేంద్ర ప్రసాద్ అన్నమాట తప్పడనీ, అతని దృష్టిలో డబ్బుకు విలువ లేదనీ.

అతను నిర్ణయించిన సమయం రాత్రి ఎనిమిదింటికి. ఒక పావుగంట ముందుగానే అందరూ అతని భవనానికి చేరుకున్నారు. దాదాపు పన్నెండు జంటలు వాళ్ళు యథాప్రకారమే హాలులో పొడుగాటి బల్లచుట్టూ కుర్చీలు వేయబడి ఉన్నాయి, బల్లమీద రకరకాల వంటకాలు,

విదేశీ మద్యాలు అమర్చబడి ఉన్నాయి. వివిధ పద్ధతుల్లో వండబడిన మాంసపు ఘుమాళింపులు నోటిని ఊరించేట్లున్నాయి. కొందరు అతను ఇవ్వబోయే బహుమతి గురించి తగ్గు స్వరాల్లో మాట్లాడుకుంటు న్నారు. ఇంకొందరు ఏ శుభ సందర్భాన ఆ విందు ఏర్పాటు చేయబడిందోనని చర్చించుకుంటున్నారు పెద్దగానే. ఆడ వాళ్ళు అతను ధరించబోయే దుస్తుల గు రి ం చి గుసగుసలాడుకుంటున్నారు నరేంద్ర ప్రసాద్ ఎప్పుడూ అతి ఖరీదైన దుస్తుల్ని లేటెస్ట్ ఫ్యాషన్‌లో ధరిస్తుం టాడు. ఆడవాళ్ళ వీధికబుర్లలో సామా న్యంగా అతని వస్త్రధారణ ఒక టాపిక్‌గ ఉంటుందంటే అతిశయోక్తి కాదు. మొత్తా నికి అందరూ మూసుకునివున్న లోపలి గది తలుపులవేపూ, పైన గోడగడియారం వేపూ ఆత్రంగా చూస్తున్నారు అతని రాకకోసం. అతను పంక్చుయాలిటీ పాటి స్తాడని వాళ్ళందరకూ బాగా తెలుసు.

మధురంగా సంగీతాన్ని వినిపిస్తూ గడియారం గంటలు కొట్టడం ప్రారంభిం చింది. ఒకటి. .రెండు అయిదు...ఏడు, ఎనిమిది! సరిగ్గా ఆ సమయాన లోపలి గది తలుపులు తెర్చుకున్నాయి, గుమ్మంలో రాజా నరేంద్ర ప్రసాద్'

ఓహ్!!

అతణ్ని చూస్తూనే అతిథులంతా దెయ్యాన్ని చూసినట్లు గభాల్న లేచి నిల బడ్డారు. కలకలం చెలరేగింది వాళ్ళలో.

"ఓ__నో "

"లేదు, లేదు "

"దారుణం!!"

"అతనికేదో పిచ్చెక్కినట్లుంది."

ఇట్లా అంటూ అంతా ఒకళ్ళ నొకళ్ళు తోసుకుంటూ గుమ్మంవేపు పరిగెత్తారు, ముఖ్యంగా ఆడవాళ్ళు.

వాళ్ళను చూస్తూ అలా నవ్వుతూ గుమ్మంలో నిలబడ్డాడు రాజా నరేంద్ర ప్రసాద్. అతని వొంటిమీద బట్టలనేవి లేవు పూర్తి నగ్నంగా ఉన్నాడతను. హారిబుల్!!

"ఏమిటి, నిజంగానే నీకు పిచ్చిపట్టిందా ఏమిటి?" అతణ్ణడిగాను తర్వాత.

చిన్నగా నవ్వాడు నరేంద్రప్రసాద్.

"ఇది నేనివ్వదల్చుకున్న ఆ ఖరు పార్టీ." అతనన్నాడు. "కాని ఒక చిన్న పొరపాటు చేశాననిపిస్తోంది. ఆ ప్రదర్శ నని విందు పూర్తయాక చేయాల్సింది"

"అదేం పిచ్చి! ఎగ్జిబిషనిస్టువా నువ్వు??"

"లేదు, వాళ్ళమీద అసహ్యాన్ని ఇంకెలా వెల్లడించాలో తెలియక."

"కాని వాళ్ళు నీ గురించి ఏమను కుంటున్నారో తెలుసా?"

"హెల్ విత్ దైర్ ఒపీనియన్స్!"

రాజా నరేంద్ర ప్రసాదులో మనుషుల మీద అంతటి అసహ్యము, జుగుప్స ఎట్లా ఎప్పుడు మొదలయ్యాయో నా కర్థం కాలేదు. విదేశాల్లో ఉన్న ఆరేళ్ళ కాలం లోనూ అతనికి ఎట్లాంటి అనుభవాలు ఎదురయ్యాయో, ఎట్లాంటి మనుష్యులు తటస్థపడ్డారోగాని మనిషి దారుణంగా మారి పోయాడు. లోకం మొత్తాన్నీ ద్వేషించ టమూ, నిర్లక్ష్యంచటమూ అలవర్చుకు న్నాడు. సంఘపు సమూహ శ్రేయస్సు




కంటే వ్యక్తిగత స్వార్థం ముఖ్యమనే పాశ్చాత్య వాదాన్ని వంటపట్టించుకున్నాడు అతను బాగా డబ్బున్నవాడు కాబట్టి చెల్లుబాటు అవుతున్నాడుగాని అదే ఏ మధ్యతరగతి మానవుడో అయినట్లయితే మనం ఊరుకునేవాళ్ళమా చెప్పండి!? నాకు ఆశ్చర్యం కలిగించిన మరో విషయం ఏమిటంటే బాల్యంనుంచి యవ్వనారంభందాకా అంటే మానవుడిలో ఇన్స్టింక్ట్స్ నాటుకునే అతి ముఖ్యమైన కాలంలో ఈ గడ్డమీద పెరిగిన నరేంద్ర ప్రసాద్‌లో ఇక్కడి సెంటిమెంట్లనేవి కొన్నయినా మిగలకుండా పూర్తిగా క్షాళితుడయాడా' రీజనుకు అంతటి శక్తి ఉందా?? అది సంభవమేనా అని'? ఇట్లాంటి ప్రశ్నలకు కాలమే సమాధానం చెప్పాలి.

పై సంఘటన జరిగాక నరేంద్ర ప్రసాద్ పార్టీలనేవి తలపెట్టలేదు. లోకంతో సంబంధబాంధవ్యాలను పూర్తిగా తగ్గించుకున్నాడు. సమాజం కూడ అతణ్ణి గురించి అదోలా అనుకునేది కాని వేలెత్తి చూపే దమ్ము మాత్రం దానికి ఉండేది కాదు. అతను ఎక్కువగా లిక్కర్ సేవిస్తూనో లేక నాలాంటి అతి కొద్దిమంది ముఖ్య మిత్రులతో బాతాఖానీ కొడుతూనో కాలం గడిపేవాడు. మరీ బోర్ కొట్టినప్పుడు ఏ పెద్ద పట్టణానికో వెళ్ళి ఓ నెల రోజులపాటు ఉండి వచ్చేవాడు. ఈ రోజుల్లోనే అతను పెళ్ళి కూడ చేసుకున్నాడు. అతని భార్య అందమైనదీ, చదువుకున్నదేకాక సంస్కారవంతురాలిలాగే కనిపించింది. నిజానికి నేనతనికి పిల్లనివ్వటానికి ఏ శ్రీమంతుడూ ముందుకు రాడేమోననుకున్నానుగాని మన తెలుగుదేశంలో ఆస్తి ఉండాలేగాని అతను పిచ్చివాడుగానీ, కుష్టువాడుగానీ, ఆఖరికి నపుంసకుడేగానీ గాక పిల్లనివ్వటానికి వెనుకాడే తల్లిదండ్రులు కనిపించరంటే అతిశయోక్తి కాదు. అంతకంటే ఐరనీ ఏమిటంటే తెలుగు పడతులు ఇట్లాంటి సంబంధాలను స్వచ్ఛందంగా అంగీకరించటం! రాజా

నరేంద్ర ప్రసాద్‌కు పోటీపడి మరీ వచ్చాయి సంబంధాలు. అతను ఎన్ను కున్న సంబంధం బెస్టయినదని అను కున్నాను నా మట్టుకు నేను.

అతనికి పెళ్ళయిన కొత్తలో నేనతని వద్దకు వెళ్ళటం చాలావరకు తగ్గించు కున్నాను. ఎంత లేదన్నా కొత్త పెళ్ళి కొడుకాయె. వెళ్ళక వెళ్ళక వెళ్ళినప్పుడు కూడా అతనంతగా మనసు విప్పి మాట్లాడేవాడు కాదు. చిరచిరలాడుతు న్నట్లు కనిపించేవాడు. ఏమి జరుగు తోంది? అతని భార్య అతని అహంమీద దెబ్బతీస్తోందా?? అర్థమయేది కాదు నాకు. అడిగె ధైర్యమూ కలగటం లేదు.

ఒకసారి నేను వెళ్ళేసరికి అతను లిక్కరు సేవిస్తూ కూర్చున్నాడు. నిజానికి రాజా నరేంద్ర ప్రసాద్‌లో రాచఠీవి ఉంది. దానికి తగ్గట్లు మనిషికూడ చాల అందంగ ఉంటాడు. పొడుగాటి విశాల మైన బొమ్మ అతన్ది. గ్లాసులోకి పానీ యాన్ని వొంచుతున్న అతణ్ణి చూపి ముగ్ధుణ్ణవుతూ ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాను.

"నువ్వు నావద్దకు మాటిమాటికీ ఎందు వస్తున్నావో చెప్పనా?" అన్నాడు నవ్వుతూ.

చెప్పమన్నాను.

"ఒకటి—నేనిచ్చే ఈ ఫారన్ సరకు కోసమయినా అయి ఉండాలి," పక్కనున్న విస్కీ సీసాను చూపించుతూ అన్నాడు. "లేక రెండోది-నీ మనస్సులో ఎక్కడో ఓ మూల నామీద మోహమన్నా ఉండి ఉండాలి. ఐ మీన్ హోమో సెక్సువాలిటీ "

అరి దుర్మార్గుడా!!

అంతే ,ఆ తర్వాత నేను మళ్ళీ అతని వద్దకు వెళ్ళలేదు. ఎట్లా వెళ్తాం చెప్పండి, అంత దారుణంగా మాట్లాడాక!?

మరో మూడేళ్ళు గడిచాయి. ఈ మూడేళ్ళలో నేను రాజానరేంద్ర ప్రసాద్ గురించి అంతగా పట్టించుకోలేదు అతను కూడా నాకోసం ఎన్నడూ కబురంపలేదు.

ఈ మూడేళ్ళ తర్వాత ఓ రోజు ఉదయాన నాకో విచిత్రమైన వార్త తెలిసింది, అతని విషయంలో. ఎంత లేదన్నా మిత్రుణ్ణి కాబట్టి పరామర్శించటానికి వెళ్ళాను. అప్పటికి మనిషి బాగా మారిపోయాడు. మొహమంతా పీక్కుపోయి ఉంది.

"నిజమేనా అది?" అడిగాను.

అతని భార్య తోటమాలితో లేచిపోయిందట. అవునన్నట్లు తలూపేడు నరేంద్రప్రసాద్.

"విచారిస్తున్నావా?" అడిగాను. లెక్క ప్రకారం అతను విచారించకూడదు. కాని మొహంలో అట్లాంటి లక్షణాలు కన్పిస్తున్నాయి. అందుకే అడిగాను.

"లేదు, ఆమె లేచిపోయినందుకు నాకు పెద్దగా విచారం కలగటం లేదు." రాజా నరేంద్ర ప్రసాద్ అన్నాడు. కొద్దిసేపున్నాక మళ్ళీ అన్నాడు. ఆ స్వరంలో ఎంతో దిగులు, బాధ వుంది.

"విచారం ఎక్కడంటే ఆమె అంత చవక అభిరుచిని కనబర్చినందుకే అంత కంటె ఇంకెవరూ దొరకలేదా ఆమెకు? వాడు—ఆ తోటమాలి—ఆ హీన కులస్తుడు—వాడితోనా, లేచిపోవడం!?"

హహా!! పెద్దగా నవ్వాలనిపించింది నాకు. అతనిలో సెంటిమెంట్లు నిజానికి చావలేదన్నమాట! ఇన్నాళ్ళూ మనస్సులో ఏమూలో దాక్కుని ఉండాలి, బలహీన సమయాల్లో బయటికి రావటానికి, బాగుంది. అతను నేర్చుకున్న ఫిలాసఫీ పాశ్చాత్యమైనదే కావచ్చు. కాని సీసా మట్టుకు పాతదే, ప్రాచ్యమైనదే!

అవును, ప్రాచ్య సీసాలో పాశ్చాత్య సారాయి!!





# బక్కయ్య కథ

"తీసుకున్నప్పుడున్న తెలివి యిచ్చేటప్పుడు వుండొద్దయ్యా" అని ఋణదాత పేద రైతు బక్కయ్య యింటిమీదకి వచ్చి దబాయిస్తున్నాడు. ముందు నుయ్యి. వెనుక గొయ్యి — ఏం జవాబు చెప్పినా తప్పే! "ఈ ఒక్క ఏడాది ఈయన ఓర్చుకుంటే ఎంత బావుణ్ణు" అని లోపల గొణుక్కుంటాడే గాని పైకి అనలేడు బక్కయ్య.

ఈ బక్కయ్యల సందిగ్ధ పరిస్థితిని మన రాష్ట్రప్రభుత్వం గుర్తించింది. చిన్న రైతులు, భూమిలేని వ్యవసాయ కూలీలు, గ్రామీణ చేతి వృత్తులవారు తీసుకున్న రుణాలమీద మారుటోరియం ప్రకటించారు.

దీనివల్ల కోర్టులో వున్న 22 వేల దావాలు ఆగిపోయాయి. సుమారు రూ. 6 కోట్ల రుణం ప్రస్తుతానికి తీర్చనవసరం లేకుండా వాయిదా పడింది. పేదవారు యివ్వవలసిన రుణాలను రద్దు చేస్తూ, లేదా తగ్గిస్తూ చట్టం కూడా చేయాలని అనుకుంటున్నారు.

మరి మళ్ళీ కావలసినప్పుడు ఏ అయ్య ఆదుకుంటాడు? అనేది ప్రశ్న. ఎవరో ఎందుకు ప్రభుత్వమే ఆదుకునే చర్యలు తీసుకుంటున్నది

1972-73 లో సహకార సంఘాల ద్వారా యిచ్చిన స్వల్పకాలిక రుణాలు రూ. 25 కోట్లు. 1975-76 లో రూ. 78 కోట్లు. 1976-77 లో రూ. 100 కోట్లు యివ్వాలని లక్ష్యం.

సహకార సంఘాలలో మేనేజిమెంటులో సగం మంది బలహీన వర్గాలవారు వుండేట్లు చట్టాన్ని సవరించారు.

మన రాష్ట్రంలో 16 జిల్లాలలో చిన్న రైతుల సహాయ పథకాలు అమలు జరుగుతున్నాయి. 2½ లక్షల వ్యవసాయ కార్మిక కుటుంబాలకు లాభం చేకూరుతున్నది.

ఇక బక్కయ్య లెవరూ భయపడవలసిన పనిలేదు. ఋణదాతల చక్రవడ్డీల పరిధుల్లో గిరగిరా తిరిగే పనిలేదు.

---

సమాచార, పౌరసంబంధ శాఖ, హైద్రాబాదు.

DIPR. 15/76-77




'నాకు ఇక్కడొక మంచి బాయ్‌ఫ్రెండు దొరికాడు. ఈసారి నువ్వొచ్చినపుడు పరిచయం చేస్తాను' అని మా విజయక్క ఉత్తరం వ్రాసినప్పుడు నేను ఆశ్చర్యంలో మునిగిపోయాను నాతో తప్ప మరే ఇతర యువకుడితోనూ మాట్లాడడానికే సంశయించే మా అక్క ఎలా బాయ్‌ఫ్రెండును సంపాదించుకోగలిగింది?

విజయక్క మా పెద్దమ్మ కూతురు. ఆమె వాళ్ళ తల్లిదండ్రులకు ఏకైక సంతానం. అందువల్ల ఆడింది ఆటగా, పాడింది పాటగా పెరిగింది. మెడిసన్

చదవాలని అనుకొంది. చదువుతోంది. ప్రస్తుతం ఆమె తిరుపతి మెడికల్ కాలేజీలో అయిదో సంవత్సరం చదువుతోంది. నేనూ మా అమ్మానాన్నలకు ఏకైక సంతానాన్ని కాబట్టి మేమిద్దరం సొంత అక్కా-తమ్ముళ్ళలాగానే పెరిగాము. సొంత అక్కా-చెల్లెళ్ళలోనూ, అక్కా-తమ్ముళ్ళలోనూ అంతగా చొరవవుండదు. అందుకే అక్కా-తమ్ముళ్ళ మధ్య రక్త సంబంధం తెచ్చిపెట్టే అనుబంధంకన్నా, స్నేహబంధం ఏర్పడితే చాలా బావుంటుందని అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను.

చిన్నతనంనుండీ మా విజయక్కా ఆడపిల్లల స్కూల్లోనే చదువుకొంది. ఆమెకు అందువల్ల మొగపిల్లలనుచూస్తేనే భయమేసేది. ఒకసారి నేను మా స్నేహితుడి నొకడ్ని పరిచయంచేశాను.తనకంటే చిన్నవాడైనవాడితో మాట్లాడడానికే ఆమె చాలా కంగారుపడిపోయింది. అలాంటి మా అక్కా-కేమిటి? బాయ్‌ఫ్రెండు దొరకడమేమిటి? నాకే కాదు. ఎవరికైనా ఆశ్చర్యం కలగదూ మరి!

* * *

దాదాపు రెండు నెలల తరవాత తిరుపతికి వెళ్ళగలిగే అవకాశం వచ్చింది. వచ్చే ఆదివారం వస్తున్నానని ఉత్తరం వ్రాసి కరెక్టుగా ఆదివారంనాటికి తిరుపతి చేరుకున్నాను. హాస్టలుముందు లాన్స్‌లో కూర్చుని నాకోసం వెయిట్‌చేస్తూ కనిపించింది విజయక్కా. ఆమె ప్రక్కనే కూర్చుని, కబుర్లు చెబుతూ కనిపించారు మరో ఇద్దరు అమ్మాయిలు. నన్ను చూడగానే లేచి నవ్వుతూ ఆహ్వానించింది మా అక్కా. కుశలప్రశ్నలు ముగిశాక తన స్నేహితురాళ్ళనిద్దరినీ పరిచయం చేసింది. మా కిద్దరికీ ఏకాంతం కలిగించడం కోసమే గావచ్చు — వాళ్ళిద్దరూ మరో అయిదు నిముషాలకంతా హాస్టలుకు వెళ్ళిపోయారు.

వాళ్ళలా కనుమరుగు కాగానే ఉన్నట్లుండి "నేనో ప్రమాదంలో చిక్కుకున్నాన్రా రాజూ!" అంది విజయక్కా.

"ప్రమాదమా? నీకా? ఏమిటి?" కంగారుగా అడిగాను.

"నీకు రెండు నెలల క్రితం వ్రాసిన ఉత్తరంలో నాకో బాయ్‌ఫ్రెండ్ దొరికాడని వ్రాశాను గుర్తుందా?"

"గుర్తుందా! అదేమిటలా అడుగుతావు? అసలు నేనా వ్యక్తిని చూడడానికే వచ్చాను. మా అక్కాతో పరిచయం చేసుకోగలిగిన అతనెలా వుంటాడోనని అప్పటినుంచీ ఊహించుకుంటూ వుంటున్నాను. అది సరే. ముందు నీకొచ్చిన ప్రమాదమేమిటో చెప్పు?"

"ఛీ . ఛీ . మీ మగవాళ్ళను నమ్మకూడదురా రాజూ!"

"ఇంతకూ ఏం జరిగిందో చెప్పు? అలా ఎవరో ఒకరు చేసిన తప్పుకు మగజాతినంతా తిట్టడం భావ్యంకాదు "

"మొదటినుంచీ అంతా చెబుతాను విను. ఒక ఆదివారంనాడు నేను మా ఫ్రెండ్సు ఓ అయిదారుమంది కలసి పిక్చర్‌కు వెళ్ళివస్తున్నాము. హఠాత్తుగా వెనుకనుండీ 'విజయా!' అని ఎవరో పిలుస్తున్నట్లుగా అనిపించింది. తిరిగి




చూశాను. ఎవరో క్రొత్త యువకుడు. మనిషి అందంగానే ఏడ్చాడ్లే! పిలుస్తున్నాడు. నేనసలు గుర్తుపట్టలేకపోయాను. అతను దగ్గరగా వచ్చి 'నన్ను గుర్తుపట్టలేదా విజయా?' అన్నాడు. ఎలాగో ఉన్నట్లుండి అతను గుర్తుకొచ్చేశాడు. అతడి పేరు ప్రసాద్. అనంతపూర్‌లో మా మూడో ఇంటి అబ్బాయి అతను. చిన్నప్పుడు తరచుగా మా ఇంటికి వస్తూ వుండేవాడు సెలవుల్లో మా వూరికి వచ్చినప్పుడు నువ్వూ అతడ్ని చూసేవుంటావు. దాదాపు సంవత్సరం తరువాత చూశాను కాబట్టి గుర్తుపట్టలేకపోయాను అందులో నేనెప్పుడూ అతడితో బాగా మాట్లాడేదాన్ని కాను. 'గుర్తుపట్టాన్లే' నువ్విప్పుడేం చేస్తున్నావు?' అని అడిగాను. ఎమ్.ఏ. పూర్తిచేసి రీసెర్చి స్కాలర్‌గా పనిచేస్తున్నాడట! 'రోడ్లో నిల్చుని మాట్లాడడం కష్టం నువ్వు మెడిసన్ చదువుతున్నావని తెలుసు. ఆదివారం వైట్ చేస్తూవుండు. కలుసుకుంటాను.' అన్నాడు. సరే అలాగే రమ్మన్నాను. సరిగ్గా ఆదివారం అతనొచ్చేశాడు. తీరా హాస్టలు కొచ్చిన తరువాత మాట్లాడకుంటే బావుంటుందా? వీలయినంత చొరవగానే మాట్లాడాను. నెల రోజులు గడచేసరికి మంచి బాయ్ ఫ్రెండు దొరికాడని అనుకున్నాను అలా బాయ్‌ఫ్రెండులుండడమే నేడు కల్చర్ గదా! పోనీలే! నాకూ ఒక బాయ్‌ఫ్రెండున్నాడు లెమ్మనుకున్నాను. కానీ తరువాతి ఆదివారం విజిటర్స్ హావర్సులో వచ్చినప్పుడే అతడి నిజమైన మనస్తత్వం అర్థమైంది"

"ఏమయ్యింది?"

"ఆ రోజు మా ఫ్రెండ్సెవరూ లేరు. నేనొక్కదాన్నే వెళ్ళి మాట్లాడుతూ కూర్చున్నాను. ఉన్నట్లుండి అతను 'నేనో మాట చెప్పాలనుకుంటున్నాను నువ్వేమీ అనుకోకపోతే చెబుతాను' అన్నాడు. పర్వాలేదులే చెప్పమన్నాను. కాస్సేపు నసుగుతూ వుండిపోయి తరువాత 'నేను నిన్ను ప్రేమించేస్తున్నాను. నువ్వేమీ

అనుకోకపోతే పెళ్ళి గూడా చేసుకుం టాను' అన్నాడు."

"అరరే! అంత తొందరగా చెప్పే శాడా? మంచి ధైర్యస్థుడిలాగానే వున్నాడే!"

"ఆయనగారి గుణగణాల్ని తరువాత పొగుడుదువులేగానీ చెప్పే సంగతి పూర్తిగా విను. అతనలా ఆ మాట చెప్పే సరికి నాకేం చెప్పాలో తోచిందగాదు. అతడు వెంటనే పైకి లేచి 'వచ్చే వారం వస్తాను. నువ్వాలోచించుకొని ఏ సంగతీ చెప్పు' అని వెళ్ళిపోయాడు."

"మిగిలిన సంగతి తరువాత చెబుదు వులేగానీ ఇక్కడ నేను నిన్ను కొన్ని సంగతులడగాలనుకుంటున్నాను" అన్నాను.

"అడుగు" అంది మా విజయక్క నవ్వుతూ.

"మరేం లేదు. నీకు మొగవాళ్ళంటేనే భయం కదా! అతడితో మొదట చొరవగా మాట్లాడానని అన్నావు. ఎలా మాట్లా డావో నా కర్థంగావడంలేదు. అతడు అందంగా వుంటాడా?"

"ఆ! పర్వాలేదు. బాగానే వుంటాడు"

"బాగా మాట్లాడుతాడా?"

"బాగా మాట్లాడుతాడ్లే! ఏం అలా అడిగావు?"

"కొంతమందికి మంచి టాకింగ్ పవరు వుంటుంది. దానితో ఎదుటివ్యక్తిని బాగా ఆకట్టుకోగలుగుతారు."

"మరీ అంత మాటకారి కాడులే! నాతో మాత్రం బాగా మాట్లాడుతాడు. మా ఫ్రెండ్స్ను పరిచయంచేస్తే వాళ్ళతో మాట్లాడడానికే సిగ్గుపడిపోయాడు."

"అంటే నీతో మాత్రం బాగా మాట్లాడుతాడన్నమాట! అదీ సంగతి ఆ తరువాత ఏం జరిగింది? నెక్ట్సవీక్ అతనొచ్చాడా?"

"ఆ వచ్చాడు అసలు నేను వెళ్ళి అతడితో మాట్లాడగూడదనుకున్నాను. కానీ ఎందుకో అలా చేయడం మంచిది కాదని అనిపించింది వెళ్ళాను. 'ఏం ఆలోచించావు?' అని అడిగాడు 'మా ఇంట్లో దీనికి చచ్చినా ఒప్పుకోరు దయ చేసి ఆ సంగతి మాత్రం అడగకు. మనం ఇలాగే మంచి స్నేహితులుగా వుండి పోదాం' అన్నాను. అందుకు అతనే మన్నాడో తెలుసా! 'నిన్ను నేను చిన్న ప్పటినుండీ ప్రేమిస్తున్నాను. ఇప్పుడు నువ్వు కాదంటే నాకేం చేయాలో తోచడంలేదు' అన్నాడు. ఆ పరిస్థితుల్లో అతడేం చేస్తాడోనని భయమేసింది. అందుకే అతడెప్పుడు వచ్చినా నా జాగ్ర త్తలో నేను వుంటూ అతడినెలాగైనా ఆ ధోరణినుండి మార్పించాలని చూస్తు న్నాను. అది నాకు సాధ్యం కావడం లేదు. వీలయినంత కఠినంగానే మాట్లాడు తున్నాను. పాపం అతగాడు నన్ను సీరియస్‌గానే ప్రేమిస్తున్నట్లున్నాడు. నేను వెయ్యివిధాలుగా నచ్చజెప్పాను 'నాయినా! చిట్టి తండ్రీ! మా ఇంట్లో ఒప్పుకోరు. నా మాట విని నన్ను ప్రేమించడం మానే సెయ్యి' అంటూ కసురుకున్నాను. కానీ అతడు వినడంలేదు. 'నిన్ను చూస్తూ రోజులేగాదు, సంవత్సరాలు గూడా గడిపే సెయ్యగలనంటాడు' ఇంకా ఏదో పిచ్చి




పిచ్చిగా వాగుతాడు. తిట్టినా నవ్వి ఊరుకుంటాడు. ఇంకా ఎక్కువగా తిట్టి వెళ్ళిపొమ్మంటే ఏం చేస్తాడోనని భయం "

"ఏంచేస్తాడని నీ వుద్దేశం?"

"అదే తొందరపడి ఆత్మహత్య చేసుకుంటే ఆ పాపం నాకేగా చుట్టుకునేది "

పక పకా నవ్వేశాను.

"ఏం? ఎందుకురా నవ్వుతావు?"

"అంటే అతడు బాధపడుతాడని అతడికి నీ నిజమైన ఉద్దేశం చెప్పడం లేదన్నమాట' రేపు అతనొచ్చి 'నువ్వు నన్ను పెళ్ళిచేసుకోకుంటే ఆత్మహత్య చేసుకుంటాను' అంటే నిజంగా చేసుకుంటాడేమోనని భయపడి నువ్వతడ్ని పెళ్ళి చేసేసుకునేలాగానే వున్నావు " అన్నాను.

"నీకు నవ్వులాటలానే వుంటుందిలే రాజా! నీకేం తెలుసు? అతడి నొదిలించుకోవాలని నేనెంత ప్రయత్నిస్తున్నానో."

"అంటే నువ్వతడికి కచ్చితంగా చెప్పలేక పోతున్నావుగదా! పోనీ నేనే నీ ఉద్దేశాన్ని అతడికి చెప్పనా?"

"ఒద్దొద్దు. ఆ పని మాత్రం చేయకు! మెల్లగా నేనెలాగైనా వదిలించుకుంటాన్లే.. నాకు కావలసింది నీ సలహాలు మాత్రమే'"

నాకేం చెప్పాలో తోచలేదు.

"అతడిక్కడేవుంటున్నాడా? వీలయితే కలుసుకుంటాను" అన్నాను.

"ఇప్పుడు లేడుట! పోయిన ఆదివారం వచ్చినప్పుడు ఈ వారం రాలేనని ఎక్కడికో వెడుతున్నాననీ చెప్పాడు "

'హూ' అంటూ పెద్దగా ఒక నిట్టూర్పు వదలి "సరేలే అక్కా' నేనిప్పుడే నీకు సూచనలు ఇవ్వలేను. నీ సంగతి తమాషాగానే వుంది. ఇంటికి వెళ్ళి బాగా ఆలోచించి వుత్తరం రాస్తాను" అన్నాను.

"అలాగే వ్రాయి" అంది మా విజయక్క.

* * *

ఇంటికొచ్చి వారం రోజులు ఆలోచించి వుత్తరం రాశాను. ఉత్తరం అనడంకన్నా దాన్ని నా ఐదు సూత్రాల పథకం అనవచ్చు విపులంగా రాయడానికై అలా వ్రాశాను మా అక్కకంటే నేను వయస్సులో పెద్దవాడ్నిగాను. కానీ ఆమె కంటే ఎక్కువగా ప్రపంచ జ్ఞానం నాకుందని నా నమ్మకం. పైగా నా మాట వింటుందన్న ధైర్యం గూడావుంది. ఎదురుగా చెప్పలేని విషయాలను వుత్తరాల ద్వారా స్పష్టంగా చెప్పవచ్చు.

నా వుత్తరంలోని సూత్రాలను యాథాతథంగా చెప్పేస్తాను.

1. పదిహేడూ, ఇరవైఅయిదు సంవత్సరాలమధ్య వయసున్న యువతీ యువకుల మనస్సు చాలా చిత్రంగా వుంటుంది. అందుకుకారణం ఆ వయస్సే. ఆ వయస్సులో కనిపించిన ప్రతి యువకుడూ, లేక యువతీ అందంగానే వున్నట్లు అనిపిస్తుంది

ఆ ఆకర్షణనే వాళ్ళు ప్రేమగా భ్రమిస్తారు. ప్రస్తుతం ఆ ప్రసాద్ అలాంటి భ్రమలోనే వున్నాడని నా ఊహ. నువ్వు మాత్రం ఆ భ్రమకు లోబడకు.

2. 'అతడికున్నట్లుంది నన్ను మరచిపొమ్మని చెబితే ఏమైన చేసుకుంటాడ'ని భయంగావుంద'ని అన్నావు ఎముకైకా వంగనిది మానై వంగుతుందా? నువ్విలా నిజాన్ని చెప్పకుండా కాలాన్ని వెళ్ళబోస్తున్నకొద్దీ అతడు మరీ ఎక్కువగా నీ గురించి ఊహించుకుంటూ వుండిపోతాడు. నీ ప్రవర్తనను చూసి అతడు నువ్వూ ప్రేమిస్తున్నావని అనుకునే ప్రమాదం వుంది. పైగా ప్రేమ 1,2,3,4 లలాగా పెరగదు. 2,4,16,256 మొదలైన వర్గ సంఖ్యలవరుసల్లో పెరుగుతుంది నువ్వు ఇప్పటికే ఆలస్యం చేశావు. నన్నడిగితే నువ్వసలు అతడితో పూర్తిగా మాట్లాడడమే మానేయడం మంచిది. నువ్వు స్నేహంతో మాట్లాడినా అతను వేరొక రకంగా అనుకునే ప్రమాదం వుంది. జాగ్రత్త.

3 నీ కిష్టంలేని వ్యక్తి నీ ముందు కూర్చుని అలా వాగుతూవుంటే ఎలా సహిస్తున్నావో అర్థం గా వ డం లేదు. చేతులుకాలిన తరువాత ఆకులు పట్టుకోవడం మంచిదిగాదు

4 ఈ వయస్సులో ఇలాంటి సంఘటనలు జరగడం సాధారణమైన విషయమే. నీ వీటి నన్నింటినీ సులభంగా వదిలించుకుని సాగిపోతూ వుండాలి మనం మొదట మనకోసమే బ్రతకాలి. తననుతానే బాగుచేసుకోలేని వ్యక్తి ఎదుటి వ్యక్తిని బాగుపరుస్తాడన్న మాట నేనొప్పుకోను అతడు బాధపడతాడని నువ్వు బాధపడడం మంచిదిగాదు వీలయినంత తొందరగా ఆ పీడను వదిలించుకో.

5. పరీక్షలుదగ్గర్లో వస్తున్నాయన్నావు. పరీక్షలముందు ఈ గొడవల్లో పడుతూర్చి బుర్ర పాడుచేసుకోవడం మంచిదిగాదు. ఆరోగ్యం జాగ్రత్త! పూర్తిగా ఆ బాధను వదిలించుకో! బాగా చదువు బాగాతిను.

అప్పుడే నువ్వు అనుకున్న ఆశయ శిఖరాలను చేరుకోగలవు.

'నా సూత్రాలను బాగా పాటించు. లేకుంటే ప్రమాదకరమైన గోతిలోనే పడిపోతావు' అని కాస్త కోపంగానే వుత్తరం వ్రాశాను.

ఇంతలో ఆమెకు పరీక్షలు రావడం వల్ల మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరగలేదు.

సెలవుల్లో నేరుగా మా ఇంటికే వచ్చేసింది మా విజయక్క. ప్రయాణబడలిక తీరిపోయి తీరికగా కూర్చున్నపుడు అడిగాను—"ఆ అబ్బాయి కధేంజేశావు?" అని.

"నీకో సర్ప్రయిజింగ్ న్యూస్ చెప్పనా రాజూ! ఆ ప్రసాదేం చేశాడో తెలుసా? 'నేనిక్కడో అమ్మాయిని ప్రేమించేశాను. ఆ అమ్మాయిని తప్ప మరెవరినీ పెళ్ళిచేసుకోను మీరు వెంటనే వెళ్ళి ఆ అమ్మాయి తల్లితండ్రులతో మాట్లాడకపోతే నేనాత్మహత్య చేసుకుంటాను' అని మా నాన్నగారి అడ్రస్సుతో సహా వాళ్ళ నాన్నగారికి వుత్తరం రాసేశాడట! వాళ్ళు 'అలాగే చేస్తాంలేరా బాబూ! తొందరపడకు' అని ప్రత్యుత్తరం గూడా వ్రాశారుట!"

ఆమె వైపు చూచాను.

ఆశ్చర్యం. ఆమె నవ్వుతోంది

నాకు నిజంగానే కోపం వచ్చింది

తన ప్రమేయం ఏ మాత్రంలేకుండా, తనకైనా చెప్పకుండా ఇంతపని చేసిన ఆ ప్రసాదుపైన కోపం రావడానికి బదులుగా నవ్వుతోంది. ఆమె ప్రవర్తన విచిత్రంగా కనిపించింది. పైగా ఈసరికో, లేక ఇంకో రెండుమూడు రోజులకో ఆ ప్రసాద్ తల్లిదండ్రులు తన తల్లిదండ్రులతో కలసి మాట్లాడబోతారన్న భయం ఆమెలో కొద్దిగానైనా కనిపించడంలేదు.

ఆమెకేసి పరీక్షించి చూశాను. ఆ నవ్వులో వున్నట్లుండి నాకో భావం స్ఫురించింది.

అతగాడితో ఆమె అలా క్లోస్‌గా ఎందుకు మాట్లాడగలిగిందో, అతను ప్రేమిస్తున్నానంటే ఎందుకు వద్దని చెప్పకుండా 'తమ ఇంట్లో ఒప్పుకోరని మాత్రం' చెప్పిందో, పైగా చివరకు ఈ పని చేసినందువల్ల ఆమెకు ఎందుకు కోపం గూడా రావడం లేదో—మొదలైన సందేహాలకన్నింటికీ ఆ నవ్వులో జవాబు కనిపించింది. ఇంతవరకూ ఆ సందేహం స్ఫురించనందుకు నా మొద్దుబుర్ర పైన నాకే కోపం వచ్చింది.

నేనూ నవ్వుతూ అడిగాను—"కొంపదీసి నువ్వు అతడిని ప్రేమించడం లేదు గదా!" అని.

ఆమె మాట్లాడలేదు. తన సూట్‌కేసు తెరచి "అతడినెప్పుడూ చూడలేదుగదా! ఫోటో వుంది చూడు. అందంగానే వున్నాడంటావా?" అంటూ అతడి ఫోటో నందించింది.

కుర్చీలోనుండీ ఎగిరి గంతేస్తూ

దగ్గరగానే అరుస్తూ అనేశాను—"అదీ అసలు కథ!"

మా విజయక్క బుగ్గలెందుకో కెంపులై పోయాయి.



సీరియల్

# వైదేహి మంగళా

ఎ. శ్యామలా రాణి

జరిగిన కథః చిన్నతనంలోనే తల్లి దండ్రుల్ని పోగొట్టుకున్న మంగళకు అండగా నిలిచి ఆమె ఆస్తిపాస్తుల్ని సంరక్షించి ఆదరించాడు చౌదరి. రామం కుటుంబంలో దాదాపు ఒక మనిషిగా మసలేది మంగళ. రామం భార్య గౌరి అంటే ఎంతో అభిమానం. రామం తమ్ముడు రాజంటే ఎంతో అనురాగం ఆమెకు. హఠాత్తుగా రామం మరణించాడు. ఆ బాధ తట్టుకోలేని రాజు మనశ్శాంతికోసమని చెప్పి గమ్యంలేని యాత్రకు బయల్దేరాడు. కన్నకు ప్రమాదకరమైన జబ్బు చేస్తే మురళీబాబు వైద్యంచేసి ఆదుకొన్నాడు. మురళీబాబు, గౌరిల మధ్య అక్రమ సంబంధాన్నారోపించి గ్రామస్థుల మధ్య నిందితులుగా నిలబెట్టాడు రంగనాథం. మంగళ ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని మురళీబాబు, గౌరిల వివాహం జరిపించింది. మురళీబాబు గౌరినీ, కన్ననూ తీసికెళ్ళి పోయాడు. రాజు తిరిగొచ్చాడు. చెప్పుడు మాటలు విని గౌరిని అపార్థం చేసుకున్నాడు. చౌదరి కొడుకు గోవిందుకు పెద్ద సంబంధం చూస్తుండగా గోవిందు, తను ప్రేమించిన కృష్ణవేణిని గుళ్ళోపెళ్ళి చేసుకొన్నాడు. అందుకు మంగళ సహకారం వుందని తెలిసి చౌదరి మంగళపై మండిపడ్డాడు. రాజుకి మంగళపై కోపమొచ్చింది. రంగనాథం దుర్బోధనమ్మి రాజు మంగళను అవమానించాడు. హఠాత్తుగా మంగళ తాతగారు రంగంలోకి వచ్చారు. అనాథ అనుకొన్న మంగళ లక్షలకు వారసురాలని తెలియడంతో తన ప్రేమ వెల్లడిచేస్తే అపార్థం చేసుకొంటుందని భయపడి రాజు ఊరువిడిచి వెళ్లాడు. కొత్త ప్రదేశంలో మంగళకు ఏమీ తోచడంలేదు. కృష్ణతో స్నేహం కలిసింది.

"అయితే నువ్వే చెప్పు కృష్ణా! తాత గారు బాధపడకుండా ఉండటంకోసం నన్నేం చెయ్యమన్నా చేస్తాను. ఎలా మసులుకోమన్నా మసులుకుంటాను!" అంది అప్రయత్నంగా.

"నిజమా?" నమ్మలేనట్లుగా చూసాడు కృష్ణ. అవునన్నట్లు తలాడించింది మంగళ. "మంగళా! నిన్ను చూడక ముందు బాబుగా రెంత భయపడ్డారో తెలుసా? నీ కాయన మీద చెప్పలేని ద్వేషం కలుగుతుందని, అసలాయనతో రావడానికే ఒప్పుకోవేమో నని కూడా అనుకున్నారు! నువ్వు చాలా మొండిపిల్లవని, పట్టుదల మహా జాస్తి అని చెప్పేడులే రామినాయుడు - కాని, నువ్వందుకు చాలా వ్యతిరేకంగా ఉన్నావు-దానికాయనెంతో పొంగిపోతున్నారు. కాని, నీ విషయంలో ఆయనకొక పెద్ద వెలితి ఉండిపోయింది. ఆయన సంతోషంకోసం ఏంచెయ్యమన్నా చేస్తానని నువ్వనడంచేత చెప్తున్నాను." చెప్పనా, మాననా అన్నట్లు చూస్తున్నాడతను.

"ఏమిటది?" బేలగా అడిగింది మంగళ.

"నువ్వు చక్కని విద్యావంతురాలివి కావాలని ఆయన కోరిక!" అన్నాడో, లేదో అదిరిపడ్డట్లయింది మంగళ. "ఏమిటీ? నేనా? ఈ వయసులో చదువుకోవాలా?" అంది గాభరాగా.

కృష్ణకి నవ్వొచ్చింది "ఏం? ఎందుకు చదువుకోకూడదూ? ఏం వయసు మీరి పోయిందని! నీకూ కాలక్షేపంగా ఉంటుంది. ఎన్నో కొత్త విషయాలు తెలుస్తాయి. నీలాంటి తెలివైన పిల్లకు నాలుగేళ్ళలో చెప్పేది రెండేళ్ళలో చెప్పవచ్చును. నా కా నమ్మకముంది. నువ్వు సరేననుమంగళా!" బ్రతిమిలాడుతున్నట్లుగా అడిగాడు కృష్ణ.

వచ్చినా 'సరే' అన్నమాట మంగళ నోట రాలేదు. చదువనగానే భయం, దిగులు ముంచుకొచ్చాయి. 'ఈ పిల్లకు చదువు చెప్పడం మా తరం కాదు బాబోయ్!' అని జడిసిపోయిన తన చిన్ననాటి మాస్టర్లు జ్ఞాపకం వచ్చారు. అప్పుడు తను నవ్వుకునేది. ఇప్పుడు దుఃఖ మొస్తూంది. కాని పూర్తిగా 'ససేమిరా' అనేయడానికి కూడా ధైర్యం చాలలేదు.

తత్ఫలితంగా మూడు రోజుల్లోగా మంగళకు చదువుచెప్పేందుకొక ట్యూటరు వెలిసాడు, ఆమె ప్రాణానికి యమదూత లాగ. మంగళ చదువుకుంటానందని తెలిసాక రంగారావు సంతోషం పట్ట శక్యం కాలేదు. పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణసంకటంలాగ మొదలయింది మంగళ చదువు.

ఆరునెలల్లోగా ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడేలా చేస్తానన్న రిటైర్డ్ టీచరు విశ్వనాథం ఏదో చెప్పుకు పోతూంటే — తన మానాన తను ఇంకేదేదో ఆలోచించుకుంటూండేది మంగళ.

తాత కోరిక తీర్చుకోడానికైనా తనకు నాలుగు ముక్కలు పట్టుబడాలంటే మొదట రాజుని మరచి పోవాలని ముందులో చాలా ప్రయత్నించింది మంగళ. కాని కోరి మరవాలనుకుంటే అదే మరింత గాఢంగా నాటుకుంటుంది గుండెలో. పుట్టి పెరిగిన ఊరు నొదిలేయ లేదా? ఆ బాంధవ్యాల నన్నిటినీ వదిలేయ లేదా? రామం పోతే కాలక్రమాన ఆ



దుః ఖ ం మరచిపోలేదా? స్వంత తోబుట్టువులాంటి గౌరిని, 'నీ కొడుక'ని అంతా వెక్కిరించే కన్న గాడిని విడిచి ఉండటానికి అలవాటు పడలేదా? ఈ రాజుని మాత్రం ఎందుకు మనసులోంచి తీసేయ లేను?' అని అనుకుందేగాని, అదే మాత్రం సాధ్యపడలేదు.

మూడు నెలలు గడిచి విశ్వనాథం చేతిలో మూడొందలు పడ్డాయి. మంగళ చదువు మూడు సెంటీమీటర్లు కూడా ముందుకి జరగలేదు. ఎందుచేత సరిగా దృష్టి చదువుమీద పెట్టవని అతనడగడు. ఎలాగో వకలాగ నెలకి వందరూపాయలు చేతిలో పడుతూంది, పిల్లలవాడు అతని యాతన అతనిది. మంగళకీ అదే బాగుంది. ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టటానికి ప్రయత్నించడు చదవమని వేధించడు. తన పాటేదో, తను పాడేసి, పట్టెడు పొడుం పీల్చేసి, టైము కా గా నే చక్కా లేచి ఇంటికి పోతాడు. తను చదువుకుంటూన్నట్టూ ఉంది. తాతకు ఆనందంగా ఉంది. త న కు అట్టే ఇబ్బందిగానూ లేదు.

కాని యి ఆట అట్టే రోజులు సాగ లేదు.

ఓరోజు ముసలాయన సాయంకాలం పూట మంగళతో కబుర్లు చెపుతూ "బాగా చదువుతున్నావామ్మా?" అంటే మంగళ గంగిరెద్దులా తలాడించింది.

"నీ కిక్కడ సుఖంగా, సంతోషంగా ఉందా?" అంటే కూడా తలూగించింది.

"అయితే ఆ మాటే ఇంగ్లీషులో చెప్పు చూద్దాం." అనేసరికి మాత్రం తలూగించటం మాని ఆకాశం కేసి చూసింది వేదాంతిలా.

"పోనీ సంతోషానికి ఇంగ్లీషులో ఏమంటారో తెలుసా."

తల అడ్డుగా తిరిగిందిసారి.

"హేపీనెస్ అంటారమ్మా' మాష్టా రేమీ చెప్పడంలేదూ?" అని కాస్త విసు క్కుని "సరే, ఇప్పుడు చెప్పు" అన్నా డతను తిరిగి మంగళ మూగబొమ్మలా చూసింది. ఈసారి విశ్వనాథంమీద చాలా కోపమొచ్చిందతనికి. మంగళ భయపడ సాగింది.

"ఇతను డబ్బు పట్టుకెళ్ళటమే కాని, ఏమీ చెప్తున్నట్టు కనిపించటంలేదు. ఇలా అయితే ఎంత తెలివైన వాళ్ళకయినా ఆరు నెల్లు కాదుకదా—ఆరు సంవత్స రాలకి కూడా ఏమీరాదు. పోనీ మరో చిన్న వాక్యం—నేను మీ మనుమరాలిని అని చెప్పు" అన్నాడతను ఆనందిద్దామని.

"అబ్బే—అంతవరకూ ఎక్కడొచ్చిం దప్పుడే." అంది మంగళ వాపుకబురు చల్లగా.

ఆ దెబ్బతో మర్నాడే విశ్వనాథానికి స్వస్తి చెప్పబడింది

'పోన్లే పీడ వదిలింది.' అని సంతో షించ బోతూన్నంతలో మళ్ళీ ఒక విపత్తు, ఈసారి ఒక ఆంగ్లో ఇండియన్ యువతి రూపంలో మంగళ ముందు ప్రత్యక్షమయింది.

ఆమెకు తెలుగు తిన్నగారాదు కనక

పురాణ హాస్యామృతం!




మంగళకు తప్పనిసరిగా ఇంగ్లీషు పట్టుబడుతుందన్న రంగారావు అంచనా తారుమారయింది.

ముచ్చటగా మూడునెలలు గడిచేసరికి, ఆ ఆంగ్లో ఇండియన్ లేడీ తెలుగులో వటవట వాగడం నేర్చుకుంది కారణం ఆమె మంగళకు చెప్పిన పాఠాలకంటే మంగళ ఆమెకు చెప్పిన పాఠాలే ఎక్కువ. ఆమె ఏమైనా చెప్పాలని నోరు తెరుస్తే చాలు "ఆగాగు- ముందు నే చెప్పేది విను!" అనేది. అన్నీ పాలెం కబుర్లే: ఆ పాలెం మనుషులతో తనకు గల సంబంధం ఎంతో ఆనందంగా అలా అలా వర్ణించుకుంటూ మంగళ చెప్పుకుపోతూంటే, ఆ చెప్పడంలో ఆమె చూపించే శిల్పచాతుర్యానికి పొంగిపోతూ, చెవులు రిక్కించుకు వినే ఆ బాబ్‌డ్ హెయిర్ పిల్లంటే మంగళకు చాలా మక్కువ ఏర్పడింది. పోన్లే, కబుర్లు చెప్పుకుందికి ఓ ఆడతోడు దొరికిందని మురిసింది.

ఈ సంగతి రంగారావుకి తెలియబోయే సరికి అతని చేతిని మరో మూడువందలు వదిలింది.

"కృష్ణా: లాభంలేదురా- మంగళకు చదువుమీద ఆసక్తి ఉన్నట్టులేదు!" అని నీరసపడిపోతూన్న రంగారావుకి, ఆఖరి ప్రయత్నంగా తానే చదువు చెప్తానని ధైర్యం చెప్పేడు కృష్ణ

బాబ్‌డ్ హెయిర్ పిల్ల వెళ్ళిపోతూన్ననాడు మంగళకి మహా బాధ అనిపించింది. అంతేకాక కృష్ణ గురువయాడు. నిజమైన గడ్డు రోజులొచ్చాయి.

సీరియస్‌గా అతనేదో చెప్పబోతే



మంగళ నవ్వేది. కప్ప దాట్లు వేసి మరో కబుర్లు చెప్పేది. దేనికైనా సమాధానం చెప్పి తీరాలని అతను పట్టుబడితే "వాళ్ళిద్దరూ నన్నెప్పుడూ ఇలా నిలదీసిఅడిగేవారు కారు!" అనేది అదేదో అవమానం చెందినట్టు ముఖంపెట్టి. కృష్ణకిక ఎలా చెప్పాలో బోధపడలేదు. చనువుగా చెప్పబోతే ఆటలు పట్టిస్తుంది. సీరియస్‌గా చెప్పబోతే ఎవడో దుర్మార్గుడిని చూసినట్టు బెరుగ్గా చూస్తుంది. తనకు విద్యాబుద్ధులు చెప్పించి ఇంతవాడిని చేసిన రంగారావు ఆనందంకోసం తాపత్రయపడి ఈ ఉద్యోగం నెత్తిన వేసుకున్నాడేకాని, మంగళకు చదువు చెప్పడం తనవల్ల కూడా కాదని అతనికి కొంచెం రోజుల్లోనే అర్థమయిపోయింది.

నెల్లాళ్ళు పోయాక ఒకరోజు మంగళే చొరవ తీసుకుని చెప్పేసింది. "కృష్ణా! సమయం విలువ చెప్పలేనిదంటావు కదా? నా కోసం, నీ సమయాన్నెందుకు ఇలా వృథా చేసుకుంటావు? ఇక వదిలేద్దూ. అన్నం కలిపి నోటికి ముద్ద అందించే వరకూ చెయ్యవచ్చుగాని మింగలేరు కదా! నువ్వింత ప్రయత్నించినా నా కెందుకో మింగబడకుండా ఉంది నేనేం చెయ్యను? ఈ సంగతి ఎలాగో ఒకలాగ ఆయన మనసుకి నొప్పి కలగకుండా నువ్వే తాతగారికి చెప్పెయ్!" అంటూ ఆ పుస్తకాలన్నీ తీసి పాత పేపర్లున్న షెల్ఫులో తోసేసింది మంగళ. నోటమాట రాలేదు కృష్ణకి.

* * *

ఆ రోజు రంగరావు ఫ్యాక్టరీ నుండి వచ్చి తీరిగ్గా కూచున్న సమయంలో కృష్ణ ఆయన దగ్గరగా కూచుని ఏం చెప్తున్నాడో, అది విన్న ఆయన ముఖకవళిక లెలా మారతాయో, తెలుసుకుందుకు గప్‌చిప్‌గా ఓ వార పొంచి నిల్చుంది మంగళ.

"బాబుగారూ! ఆ చౌదరిగారు చెప్పింది సెంట్ పర్సెంట్ కరెక్టండీ! మంగళ తెలివితేటల ముందు ఈ చదువుకున్న వాళ్ళెందుకూ పనికిరారన్నమాట అక్షరాలా నిజం!" అంటూ ఉపోద్ఘాతం ప్రారంభించాడు కృష్ణ.

రంగరావుకి ఇంకేదో అర్థమైగర్వంగా మీసాలు మెలేసుకున్నారు.

"నాకు తెలుసురా! చదువు చెప్పే వాళ్ళలో బుద్ధి ఉండాలికాని, దాని తెలివితేటలకేం? చాకులాంటి పిల్లరా అది. ఊఁ చెప్పు. చెప్పు. ఎంతవరకొచ్చింది వ్యవహారం" అన్నారు ఉల్లాసంగా.

"నాకు పాఠాలు చెప్పేవరకూ!" ఉన్న నిజాన్నే ఏదో అతిశయోక్తిగా చెప్తున్నట్టు నవ్వు మిళాయించి చెప్పేడు కృష్ణ.

"ఊఁ హుఁ" అంటూ ముసిముసిగా నవ్వుకున్నాడాయన.

మంగళ హాయిగా ఊపిరి తీసుకోబోతూంటే మళ్ళీ అతని కంఠం విన్పించింది.

"మంగళంతా వాళ్ళమ్మ పోలికేరా కృష్ణా! రూపంలోనే కాదు, ఆ కొంటె పనులు, మాట తెగింపు. సూదంటు రాయిలా గ్రహించే తెలివితేటలు - అంతా నాకు మళ్ళీ పార్వతే తిరిగొచ్చినట్టుందంటే నమ్ము!"

పురాణ హాస్యవృత్తం!




"పోన్లే, ఏదో విధాన సంబరపడనీ!" అనుకుంది మంగళ.

"కృష్ణా! ఈవాళ నీతో ఓ ముఖ్య విషయం చెప్పాలనుకుంటున్నానురా! మంగళ వచ్చాక నా ప్రాణాని కెంతో హాయిగా సంతృప్తిగా ఉంది. కాని, దానికీ యుక్తవయసొచ్చింది. పెళ్ళో పేరంటమో చేసెయ్యాలి. దాన్ని విడిచి నేనుమాత్రం ఉండలేనిక- నేనెంతో ఆలోచించి ఒక నిశ్చయానికొచ్చేను నువ్వు కాదనవన్న నమ్మకంతో చెప్తున్నాను. నువ్వు మంగళను పెళ్ళిచేసుకోవాలిరా!" రంగారావు నోట అటువంటి మాట వినడానికి ఎదురుగా కూర్చున్న కృష్ణగాని, పొంచి వింటూన్న మంగళగాని, తయారుగా లేనందున త్రుళ్ళిపడ్డారు. మంగళకయితే అరికాళ్ళక్రింద మంట పెట్టేసినట్టయింది.

"బాబుగారూ! మీ దయాదాక్షిణ్యాల మీద ఇంతవరకూ వచ్చినవాడిని! నాకు అత్యాశలేమీ లేవు. నా అంతస్తేమిటో నాకు తెలుసు " కంగారుగా అంటున్నాడు కృష్ణ.

"నీకేంరా? నీ అంతస్తుకేం? ఇలాంటి పిచ్చి ఆలోచనతోనే ఒకప్పుడు నా కూతుర్ని చేజేతులా వదులుకున్నాను. ఇప్పుడలా కావడానికి వీలులేదు నేను నిర్బంధిస్తున్నానని మాత్రం అనుకోకు. ఇద్దరూ మనస్ఫూర్తిగా ఇష్టపడాలి ముందు. నేను మంగళకీ అదే చెప్తాను! నా కోరిక ఏమీ అసమంజసంగా లేదనిపిస్తూంది నాకు. మంగళ కూడా నా మాట కెదురు చెప్పదన్న నమ్మకముంది. ఇక అటుపైన దైవేచ్ఛ!"

తరువాత కృష్ణ అయనతో ఏమన్నాడో,



వినడానిక్కాని, వారి ముఖ భావాలు గ్రహించటానిక్కాని మంగళకుబొత్తిగా శక్యం కాలేదు. చెవుల్లో సముద్రపు హోరు ప్రారంభమై, కళ్ళు మసక మసకగా అయిపోయాయి. ఎలాగో ఆ స్తంభాన్ని ఆసరాగా పట్టుకుని మెల్లగా కదిలిపోయిందక్కడి నుంచి.

ఆ రాత్రంతా మంగళ కంటికి కునుకు రాలేదు. 'తనకి రాజుతో కాక మరొకరితో పెళ్ళేమిటి! ఇది కలలోనైనా జరిగే పనే! తాళికట్టకపోయినా రాజే తన భర్తని, మళ్ళీ జీవితంలో కలుసుకున్నా, కలుసుకోలేకపోయినా తాను రాజు భార్యేనని ఈ ప్రపంచానికి తనెలా చెప్పగలదు? అయినా ఈ విషయాన్ని ఆ ముసలాయనతో ఎలా చెప్పడం? అసలే గుండెజబ్బు మనిషట! తీరా ఆయన మాట కాదంటే విని భరించలేక బలహీనమైన ఆయన గుండె ఆగిపోదు కదా! రాజే స్వయంగా వచ్చేస్తే పరిస్థితి మరొకలా ఉంటుంది. కాని రాజు రాలేదు. ఇక రాడా? తనను నిజంగా మరచిపోయాడా? ఎలా? ఏంచెయ్యాలిప్పుడు?'

* * *

ఉద్యోగంకోసం కాలి చెప్పులరిగేలా తిరిగి తిరిగి చివరకి ఒక కంపెనీలో టెక్నికల్ అసిస్టెంటుగా చేరాడు రాజు.

ఆరోజు సాయంకాలం కంపెనీనుండి వచ్చి కాఫీ తాగుతూ, ఏమేమో ఆలోచించుకుంటూ కూచున్నాడు తన గదిలో. ప్రక్క వాటాలో ఉంటూన్న టైపిస్ట్ విజయ, ఆమె సవతితల్లి ఏదో ఘర్షణ పడుతున్నారు. అది వినడం రోజూ అతని కలవాటయి పోయింది. అంతలోనే ప్రొఫెసరు జగన్నాధరావుగారి నౌకరు రాముడు వచ్చాడు.

"బాబూ అయ్యగారు ఊరెళ్తున్నారు. మిమ్మల్ని అర్జెంటుగా రమ్మన్నారు!" అని చెప్పి వెళ్ళిపోయాడు. రాజు ముఖం చికాకుగా అయిపోయింది.

అప్పటికి దగ్గర దగ్గర పదిహేను రోజులయింది అతను జగన్నాధరావుగారికి ముఖం చూపించి—ఇప్పుడెందుకో అర్జంటుగా రమ్మన్నారట! ఆయన పోకడలు చాలా విచిత్రంగా ఉన్నాయతనికి. ఆయన ఒక్కగానొక్క కూతురు శారదా అంతే!

ఆ ఊళ్ళో ఉద్యోగం వచ్చాక ఓరోజు పేవ్‌మెంట్ మీద నడుస్తూన్న అతని ప్రక్కనుంచే కార్లో పోతూన్న ప్రొఫెసరుగారు కారాపి కేకేసారు ఆనందంగా. తండ్రి ప్రక్కనే కూతురు శారద కూడా ఉందారోజు. వాళ్ళింట్లో రాజుకి చాలా చనువు.

"హల్లో రాజూ! కంగ్రాచ్యులేషన్స్! ఏదో పరీక్ష ఫెయిలయినవాడిలా కనిపించటమే మానేశావేం? ఫస్టు క్లాసొచ్చిందటగా!" అంటూ పలకరించింది.

రాజు క్లుప్తంగా రామం పోవడం గురించి చెప్పి ప్రస్తుతం ఉద్యోగరీత్యా అక్కడుంటున్నట్టు చెప్పేడు.

"మరి చెప్పవేమిటోయ్ సుందా సంగతి! ఏం ఉద్యోగం?ఏమిటి సంగతి!"

# పురాణ హాస్యవృక్షం!




అన్నారు. రాజు చెప్పేడు. ఆయన పెదవి విరిచారు.

"ఇంత బతుకూ బతికి ఇంటవతల చచ్చాననట్టు—నీ సబ్జక్టేమిటి? నీ డిగ్రీ ఏమిటి? ఈ ఉద్యోగమేమిటోయ్! నా స్టూడెంటు, అందులోనూ మోస్ట్ బ్రిలియంట్ బోయ్ చివరికి టెక్నికలసిస్టెంటుగా చేరాడంటే నమ్ముతావో నమ్మవో కాని, నా తల కొట్టేసినట్టుందోయ్!"

"ఏం చెయ్యమంటారు సార్? అనెంప్లాయిమెంటు సంగతి మీకు నేను వేరే చెప్పక్కర్లేదు కదా! ఈ ఉద్యోగమైనా దొరకటం ఎంత కఠినమైందో మీకు తెలియదు!" అన్నాడు రాజు.

"ఛీ ...ఛీ. చివరికి దేశమేమిటిలా తగులబడిపోతూంది! కంట్రీ ఇలా ధ్వంసమైపోతూంటే గవర్నమెంటు ఏం చేస్తున్నట్టో తెలీదు" అన్నారాగ్రహంగా.

"ఏ గవర్నమెంటు మాత్రం ఏం చెయ్యగలదు లెండి నాన్నగారూ! ప్రతి మనిషీ ఎవరి బాధ్యత వారు విస్మరించి దొరతనం వారిని దుయ్యబట్టడంలోనే ఉంటే — ఫరెగ్జాంపుల్ — మీరేం చేస్తున్నారు? రిటైరయ్యాకయినా తప్పుకున్నారా? మీకేం తక్కువని సెకండ్ టైమ్ ఎక్స్టెన్షన్ చేస్తున్నారు! మీకేం బరువులని - బాధ్యతలని—లేదా, పోదా? అది పదవి నాన్నగారూ! పదవి! హోదా— అలవాటు పడిపోయిన ప్రాణాలకి దాన్ని వదులుకోవడం యమబాధగా ఉంటుంది. ఓ ప్రక్క సుగర్ కంప్లయింటు, మరో ప్రక్క బి.పి. ట్రబుల్స్‌తో స్టూడెంట్సుకు తిన్నగా పాఠాలే చెప్పలేని మీరు, ఏం, రిటైర్‌మెంట్ ఏజికి ఓ మూడేళ్ళు ముందుగానే విరమించుకుంటే తప్పా? ఆ వేకన్సీలో క్రిందవాళ్ళు రారూ? కొత్తగా



వచ్చిన వాళ్ళకి ఉద్యోగావకాశాలేర్పడవూ? కంట్రీనీ, గవర్నమెంటునీ తిట్టేం ప్రయోజనం?" అంటూన్న శారద ధోరణిని వింతగా గమనించాడు రాజు. ప్రొఫెసరుగారి ముఖం ఎర్రగా కందగడ్డలా తయారయింది.

అయినా వస్తూన్న ఆవేశాన్ని దిగమింగుకుని తెచ్చిపెట్టుకు నవ్వేస్తూ, "మీ యంగర్ జనరేషన్‌కి మా శారద ప్రతినిధోయ్ రాజూ! ప్రతిదానికీ ముందు నామీదే యుద్ధం ప్రకటిస్తూందిలే ఈమధ్య" అన్నారదోలా.

శారద తండ్రికేసి అసహ్యంగా చూసినట్లనిపించింది రాజుకి. తండ్రీ, కూతుళ్ళ మధ్య ఏదో సున్నితత్వం చెడినట్టు తోచింది. అయినా తన గురువుగారిని చిన్నబుచ్చుకోకుండా చెయ్యడం తన విధి అనుకున్నాడు

"అలా అనుకోకూడదు శారదా! వయసు, అనుభవాలతోపాటు నాలెడ్జిలో పండిపోయిన నాన్నగారిలాంటి టీచర్స్ ఉండటం విద్యార్థుల కెంత ఉపయోగమో తెలుసా? ఇక మనమా? కసురుకాయల్లాంటి వాళ్ళం మనకి ఓర్పు కూడా తక్కువ!" అన్నాడు.

జగన్నాధరావుగారు ఆ మాటతో గాలి పూరించిన బెలూన్లా ఉబ్బిపోయారు. "లీవిట్-లీవిట్ మై డియర్ బోయ్!" అనేశారు హుందాగా.

ఆ తర్వాత చాలాసార్లు వాళ్ళింటికెళ్ళేడు రాజు. ప్రొఫెసరుగారు తన పలుకుబడి నుపయోగించి రాజుకి యూనివర్సిటీలో ఉద్యోగం వచ్చేలా చూస్తామన్నారు. మొదటినుండీ కూడా ఆయనకు రాజంటే ప్రత్యేకమైన అభిమానం. అంచేత తనకోసం ఆయన ఏం చేస్తానన్నా ఆశ్చర్యం వెయ్యలేదు కాని, ఉన్నట్టుండి ఓ రోజు ఉపోద్ఘాతం లేకుండా ఆయనిలా అనేసరికి మాత్రం తెల్లబోయాడు.

"నాదో కోరిక తీర్చాలోయ్ రాజా నువ్వు! ప్లీజ్ టేకిట్ యాజ్ మై సిన్సియర్ రిక్వెస్ట్."

"అదేమిటి సార్ అలా అంటారు. మీకు ఆజ్ఞాపించగల హక్కుంది." అన్నాడు ఏమిటో అనుకుని రాజు.

ఆయన చాలా సంతోషించినట్టు కనిపించారు. "మా శారదను నువ్వు చేసుకోవాలోయ్!" అనేశారు

ఆ మాట రాజుకి చాచిపెట్టి జిగ్గున లెంపకాయ కొట్టినట్లు అనిపించింది. గొంతుక పొడారిపోయి నోట మాట రాలేదు. శారదను ఆ దృష్టితో తనెప్పుడూ చూడలేదు. శారద కూడా ఎన్నడూ తన ఎడల అటువంటి భావాలు ప్రదర్శించలేదు. మరి, ఆయనెందుకలా అంటున్నారో తోచలేదు.

అప్పుడు శారద కూడా ప్రక్కనే కూర్చుని ఉంది. తను ఆశ్చర్యంగా శారద ముఖంలోకి చూశాడు. శారద సూటిగా అతని కళ్ళల్లోకి చూసింది. 'ఏం చెప్తావో, చెప్పు వేగం' అన్నట్లుగా. ఆ చూపులు గుచ్చుకున్నట్లయ్యాయి రాజుకి.

"నువ్వు కాదనవని నాకు తెలుసనుకో!

పురాణ హాస్యవృక్షం!




అయినా అడిగేవాడు అందునా ఆడపిల్ల తండ్రి చెయ్యి ఎప్పుడూ అడుగున ఉండవలసిందే కదా! ఎలా అడిగానో ఏమో. ఏమీ అనుకోకు. నీమీద నాకు సంపూర్ణమైన నమ్మకముంది. నీలాంటి అల్లుడు దొరకడం నా అదృష్టం. మా శారద నీకేమీ కొత్తకాదు. మీ ఇద్దరూ చిలుకా గోరింకల్లా కలకల్లాడుతూ నా కళ్ళ ముందు మసలుతూంటే, ఈ వృద్ధాప్యంలో నా కంతకంటే ఏంకావాలోయ్? మళ్ళీ మాట్లాడుతాన్లే ఈ విషయమై నీతో!" అనేసి ఎవరో వస్తే వాళ్ళని కలవాలని బయటకు వెళ్ళిపోయా రాయన.

శారద కూడా లేచిలోనికి వెళ్ళిపోబోయి ఏదో ఆలోచించుకున్నట్టు వెనక్కి తిరిగి రాజు దగ్గరగా వచ్చి నిలబడింది. రాజు ఇబ్బందిగా శారదకేసి చూసాడు.

"రాజూ! నువ్వెప్పుడేనా, ఎవరినైనా ప్రేమించావా?" చాలా గంభీరంగా అడిగింది

'అంటే తన ముఖంలో కన్పించిందా ఆభావం? అయితే మాత్రం-అదేం అబద్ధం కాదుగా! తను మంగళని ప్రేమించలేదూ? ఆమెతో గిల్లికజ్జాలూ, పోట్లాటలూ, అని, అనిపించుకోవడాలూ, ఇవన్నీ ప్రేమ లేకుండానే చేశాడా? కాని మంగళకు మనసు విరిగిపోయుంటుంది. అవన్నీ శారదతో ఎలా చెప్పడం?' అనుకుంటు న్నాడు.

"ఏంలేదులే! నీ ముఖం చూస్తే అలా అనిపించడంలేదు!" అనేసి చరచరా వెళ్ళి పోయింది శారద.

రాజు అప్రతిభుడైపోయాడు అతని మనసంతా కెలికినట్లయిపోయింది. శారద ఎవరినేనా ప్రేమించిందేమో! తన మౌనాన్ని అపార్థం చేసుకున్నట్లుంది.



తనెందువల్లనో అడగ్గానే విడమరచి చెప్పలేక పోయాడు. అసలేమి చెప్పాలన్నా, చెయ్యాలన్నా ఎవరూ మిగలలేదక్కడ. ఖాళీ కుర్చీలూ, నిశ్శబ్దం మిగిలాయి. వీలయినంత తొందరగా తన గదిలో కొచ్చిపడ్డాడు ఆరోజు. ఆ తరువాత మరి వాళ్ళింటికి వెళ్ళలేదు.

ఈవాళ రమ్మని ప్రొఫెసరుగారు కబురు పెట్టేరు. అంతగా ప్రత్యేకించి పిలుస్తున్నప్పుడు వెళ్ళకపోతే చాలా అమర్యాదగా ఉంటుంది. బహుశః మళ్ళీ ఆ విషయం కదపాలనే పిల్చిఉంటారు. కాని, శారద వాలకం చూస్తే మరింత వింతగా ఉంది. ఇష్టం లేకపోతే తండ్రికి సూటిగా ఎందుకు చెప్పలేకపోతూంది? ఇన్ని మాటలాడే శారదకు తండ్రిదగ్గర భయమా? ఏమైనాసరే తనే చెప్పేయాలి. 'మంగళతో జరగని తన పెళ్ళి ఇంకెవ్వరితోనూ జరగదని!' అదే నిశ్చయంతో ప్రొఫెసరుగారింటికి బయలుదేరాడు రాజు.

1

రాజు వారిల్లు చేరుకునేసరికి ప్రొఫెసరుగారు ప్రయాణ సన్నాహంలో ఉన్నారు. రాముడు ఆయన సూట్ కేస్ తీసుకెళ్ళి కార్లో పెడుతున్నాడు.

"పిలిచారుట!" ముక్తసరిగా అడిగాడు. తన మనసులోని మాటని ఎంత వేగం చెప్పేద్దామన్న తొందరకూడా విన్పించిందా కంఠంలో.

"అవునోయ్! ఈవాళ నేను తప్పనిసరిగా రాజమండ్రిలో నా స్నేహితుడి కొడుకు పెళ్ళికి వెళ్ళవలసొచ్చింది. శారదకేమిటో వంట్లో సరిగాలేదని రాననేసింది. అంచేత ఒక్కడినే వెళ్తున్నాను. వీలయినంతవరకు రేపు సాయంకాలం లోగా రావటానికి ప్రయత్నిస్తాను. అంతవరకూ ఈ లంకంత ఇంట్లో శారద వక్కర్తే బిక్కుబిక్కుమంటూ ఉండాలని, నువ్వు కాస్త సాయంగా ఉంటావని నీకు కబురు పెట్టేను. మరి వెళ్ళి రానా!" అంటూ ముందుకి కదిలారాయన. కంగారుగా ఆయన్ననుసరించాడు రాజు.

జగన్నాధరావుగారు కారెక్కబోతూ ఇటూ అటూ చూసి శారద అక్కడ లేకపోవడంతో నెమ్మదిగా అన్నారు "రాజూ! నేను లేనప్పుడు శారద బహుశః నీతో ఏమైనా చెప్పవచ్చు. అలా తనకు తానుగా నీతో చెప్పేయడం ఓ రకంగా మంచిదేనన్న ఉద్దేశ్యంతోనే, ఇలాంటి అవకాశం నేనే కల్పిస్తున్నాను. దాపరికం లేకుండా చెప్తున్నాను విను! ప్రస్తుతానికి శారదకీ పెళ్ళి ఇష్టం లేదు. సమ్మతం కాదు. రాజూ! శారదకింకా పసితనం వదల్లేదు. పెళ్ళయ్యాక తప్పక తనే సర్దుకుంటుంది. నా కిలాంటి కేసులెన్నో తెలుసు. నిన్నేదో మోసగిస్తున్నానని మాత్రం అనుకోకు. నువ్వు కూడా కొంచెం ఓర్పు ప్రదర్శించావంటే అంతా సవ్యంగా ముగుస్తుంది. ఇంతకిమించి నిన్ను కోరేదేమీ లేదు!" అంటూ రెండు చేతులూ పట్టుకున్నారాయన. రాజేదో తిరిగి అనబోయేంతలో శారద బయటికొచ్చింది.




జగన్నాధరావుగారు కారెక్కిపోయారు.

దిగాలుగా వచ్చి లోపల కుర్చీలో జారగిలబడ్డాడు రాజు.

శారద వచ్చి కాఫీ, టిఫిన్ తీసుకోమని బలవంతపెట్టింది. ఆ టైములో శారద ఏమి చెప్తామనుకుంటూందోనని ఎదురు చూసాడు. ఆమె కాలేజి కబుర్లు, తన సబ్జక్టు గురించి మాట్లాడింది. తన మనసులో ఉద్దేశ్యం చెప్పే అవకాశం ఇవ్వకుండా వేరే పనిమీద వెళ్ళిపోయింది.

ఆ వెళ్ళిపోవడం రాత్రి ఎనిమిది గంటలప్పుడు మళ్ళీ భోజనాల బల్లదగ్గరే ఎదురయ్యింది. వంటామె వడ్డిస్తూంటే భోజనం పూర్తి చేసారు. అప్పుడు కూడా శారదే ఇంకేవేవో మాట్లాడింది. రాజు ఏదో చెప్పాలని నోరు మెదిపే సరికల్లా 'ఈ సంగతి విన్నావా' అంటూ ఏ మాత్రం ప్రత్యేకతలేని కబుర్లను కూడా తగని ఉత్సాహంతో చెప్పింది. భోజనాలు ముగియగానే గెస్టు రూములో అతనికని ఏర్పరచిన పడక చూపించేసి, గుడ్ నైట్ చెప్పేసి మేడమీదకు వెళ్ళిపోయింది.

రాజు తలుపులు దగ్గరగా వేసి మంచం మీద కూర్చున్నాడు. అతనికి మెద డేమాత్రం పనిచెయ్యటంలేదు. నిముషాల మీద నిముషాలు గడచి గంటలుగా మారి పోతున్నాయి. రాజుకి నిద్ర రాలేదు. ఏం చెయ్యాలో తోచలేదు.

* * *

హాల్లో గోడ గడియారం 'టంగ్ టంగ్' మంటూ పన్నెండు గంటలు కొట్టింది. రాజు చిరాగ్గా మంచం దిగి కిటికీ దగ్గర కొచ్చి ఎదురుగా చూసాడు. అప్పుడే శారద మేడదిగి వస్తూంది. లేత

నీలంరంగు బెడ్‌లాంపు వెలుతుర్లో ఆమె చిత్రంగా కన్పించింది రాజుకి. కళ్ళు నులుముకుని చూసాడు. అందంగా పెళ్ళి కూతుర్లా అలంకరించుకున్న శారద, జడ కుప్పులు సరిచేసుకుంటూ మేడమెట్లు దిగుతూంటే 'టిక్ టిక్'మని మెల్లగా హాలు తలుపు తట్టిన శబ్దమయింది.

ఏదో డిటెక్టివ్ పిక్చరు చూస్తున్నట్లు ప్రాణాలు బిగబట్టుకుని ఆత్రంగా చూస్తూ వారగా నిల్చున్నాడు రాజు. శారద తలుపు తీసింది. ఒక గంభీర విగ్రహం శారద చేతి నందుకుంటూ కుడికాలుపెట్టింది హాల్లో. రెండోకాలు కోసం అప్రయత్నంగానే రాజు కళ్ళు ఎదురు చూసాయి. ఈసారి ఆ ఆజానుబాహు యువకుడు రెండోకాలుపెట్టేడు.కాని, అది కర్రకాలు!

శారదా అతను గుసగుసగా ఏదో మాట్లాడుకున్నారు. రాజుకి చూచాయగా ఏమో అర్థమైనట్లయింది. కాని, శారద, అతను కలసి తలుపులు జారవేసి బయటికి వెళ్ళిపోతారన్న అతని అంచనా మాత్రం తారుమారైంది.

శారద అతన్ని సోఫాలో కూర్చోపెట్టి అతని గదికేసే నడిచి వచ్చింది. రాజు ఏమీ ఎరగనట్టు వెళ్ళిపడుకున్నాడు. తలుపు మీద శబ్దం అయ్యాక తెలివొచ్చినట్లు నటిస్తూ లేచి తలుపు తెరచి లైటువేసాడు. శారద జరీబట్టల్లో, జడనిండా పువ్వులతో, నుదుట కల్యాణ తిలకంతో ధగధగ మెరిసిపోతున్నట్లుంది.

"ఎక్స్యూజ్ మి రాజూ! దయచేసి ఇలా వస్తావా?" అంటూ రాజుని హాల్లోకి తోడుకొచ్చి పరిచయాలు చేసింది. "రాజంటే ఇతనే బావా! ఐ లైక్ హిమ్ వెరీమచ్! నాన్నగారి లైకింగ్ వేరుగా ఉందనుకో!" అంటూంటే ఆ యువకుడు నవ్వి కూర్చున్న చోటునుండే సాగి "గ్లాడ్ టు మీటూ్యు!" అని చెయ్యందుకున్నాడు.

"రాజూ! ఇతనెవరో తెలుసా? మా బావ సుదర్శనం. నాకు స్వయాన మేనత్త కొడుకు. చిన్నప్పటినుండి నన్ను బావకిచ్చి పెళ్ళి చెయ్యాలని పెద్దవాళ్ళంతా ఎంతో ముచ్చటపడ్డారు. నాన్నగారు కూడా! బావ పైలట్ ఆఫీసరయ్యాడని నా కంటే ఎక్కువ నాన్నే మురిసిపోయారు. కాని విధి వక్రించి, బంగ్లాదేశ్ యుద్ధ సమయంలో ఒక ప్రమాదంలో బావకి కాలు పోయింది. అంతే, నాన్నగారు టక్కున మారిపోయారు. వికలాంగుడిని చేసుకుని నేను సుఖపడలేనని ఆయన బాధ. నాకు కూడా చాలా బోధపరిచారు. పెళ్ళయ్యాకే ఈ ప్రమాదం జరిగితే ఎవరేం చేయ గలిగేవారు? పెళ్ళి అయినా కాకపోయినా, నా మనసులో ఎప్పుడూ నా భర్త మా బావే! అది ఈ వెధవ ప్రపంచానికి నేనెంత అరచి చెప్పినా అర్థం కాలేదు. తీసుకొచ్చిన సంబంధాలన్నీ నేను తిరగ్గొట్టినా నాన్నగారు నన్నర్థం చేసుకోలేదు. ఏమైనా అనబోతే ఒక్కగానొన్నదానివి. నా మాట వినవా? అని దీనాలాపాలాడుతారు!

అందుకే, ఈ రోజున తెల్లవారు ఝామున ముహూర్తానికి బావా, నేనూ దంపతులం కాబోతున్నాం. నేనందుకే నాన్నగారితో పెళ్ళికి వెళ్ళలేదు. బావా వాళ్ళదీ దగ్గర పల్లెటూరే! ఈ రోజు నాన్నగారు వెళ్ళి తీరతారని తెలియగానే ఆ సంగతి తెలియజేస్తూ, నేనే ఈ పెళ్ళికి తొందరచేసాను. అక్కడ గుళ్ళో పెళ్ళి

కప్పుడే అన్ని ఏర్పాట్లూ జరిగాయి. అంచేత ఈ లోకపు వాడుకపదంలో నేను లేచి పోతున్నాను. ఎవరితో? మా బావతో, నా కాబోయేభర్తతో!" అదోలానవ్వింది శారద. రాజు కోవిధంగా మనసు తేలికయింది

"ఒక రకంగానన్న సాహసానికి పురి కొల్పింది నాన్నగారే' ఎంత చెప్పినా నా మనసాయన కర్థంకాలేదు. నే నాయనతో విసిగి చివరికీ నిర్ణయం తీసుకున్నాను. నాకు గత్యంతరం లేకపోయింది.

"నాన్నగారు నిన్ను కూడా ఇరికించా రిందులో. నిన్ను నా కీవాళ కాపలాపెట్టేరు. నీ మౌనం నా కర్థంకాలేదు నిన్నే విధంగా నయినా బాధించివుంటే క్షమించు నువ్వంటే నాకు చాలా ఇష్టం నీలాంటి అన్న వుంటే బాగుండుననిపిస్తుంది. అందుకే నీ అనుజ్ఞ తీసుకుని వెళ్తున్నాను" అంది కళ్ళు తడిగా మెరుస్తూంటే, జుకి కూడా ఎందుకో అప్రయత్నంగా కళ్ళు చెమ్మగిల్లాయి

"నీ సంగతేమీ నాకూ తెలియదుకాని. నా కెప్పుడూ నాన్నగారనుకుంటున్న భావం లేదు శారదా' నన్ను నమ్మ్కు. ఆ మాట నీతో చెప్పాలనే సాయంకాలం నుండి ప్రయత్నిస్తూంటే నేనింకేమి చెప్తానోనన్న భయంతో నువ్వు నన్ను మాట్లాడనివ్వలేదు. నాన్నగారు నీ కింకా పసితనం వదల్లేదన్నారు' చూడగా చూడగా ఆయనకే వదల్లేదనిస్తూంది!" సుదర్శనం. శారదల ముఖాలు ఆనందంతో విరిసాయి.

"అయితే ఇంకెందుకీ ఆలస్యం. కమాన్ అవతల సుముహూర్తం వేళ మించిపోగలదు. వేగం నడవండి బావ మరిదొచ్చి, గడ్డంక్రింద బెల్లంముక్కుంచి బ్రతిమాలే వరకూ నేను పెళ్ళిపీటల మీదికి కూడా రానాయే మరి! హర్రీ అప్!" అంటూ రాజు చేతి నాసరాగా పట్టుకుని లేచాడు సుదర్శనం.

"చూశావా! అప్పుడే కాశీ ప్రయాణం కోసం ఎలా తొందరపడి పోతున్నాడో మా బావ! పద-పద!" అంది నవ్వుతూ శారద.

అలా వాళ్ళతో వెళ్ళటమా మానటమా? అన్న తర్కం లేకుండా రాజు తేలికైన హృదయంతో వాళ్ళ ననుసరించాడు.

కాని, అలా వెళ్తున్నప్పుడు అతనికి, మంగళ గోవిందు. కృష్ణవేణిల పెళ్ళి చేయించటం జ్ఞాపకమొచ్చింది. (సశేషం)



# మా సంసారంలో మహాప్రస్థానం

## శశిధర్

ఈ వేళ ఆదివారం గనక భళ్లున తెల్లారి ఎనిమిది గంటలవుతూన్నా ఆయ నింకా నిద్దర్నించి లేవలేదు. వంటింట్లో గ్యాసు పొయ్యిమీద పాలల్లో కాఫీ డికా షను కలుపుతూ తలతిప్పి నేరుగా అగ పడుతూన్న బెడ్రూము వేపుచూసాను. ఆయన మంచంమీద బోర్లా పడుకుని గాఢంగా నిద్రపోతున్నారు చిన్న పిల్లా డిలా.

(ఏ మాట కామాటే చెప్పుకోవాలని రూలంటూవుంటే నిజం చెప్పేస్తున్నాను. పసి పిల్లాడిలా అమాయకంగా కను పిస్తూన్న ఆయన్ని ముద్దుపెట్టు కోవాలని పించిందంటే నమ్మండి.)

అలా నిద్రపోతూన్న ఆయన్నీ నన్నూ ఓ షాటులో చూపించి, తరువాతి షాటులో నేను పాలల్లో కలుపుతూన్న డికాషను గనుక యే సినిమాలో నన్నా చూపిస్తే ప్రేక్షకులు చప్పట్లు కొట్టకమానరు. అంటే ఆయన పాలవంటి వారనీ నేను డికాషన్లాటి దాన్ననీ నా(లోని దర్శకురాలి) వుద్దేశ్యం. ఆయన ఎమ్మే తెనుంగు. మరినేను ఒకటోక్లాసు ముందు లోయరూ అప్పరూ కే. జీలనుంచీ, బీ. యెస్సీ వరకూ (రెండు సబ్జక్టులున్నట్టున్నా యనుకోండి) పదహారణాల ఇంగ్లీషు మీడియం. అసలు పసితనం నించీ నేను తెలుగు అంటే మాకుక్కపిల్లని స్నానం చేయిస్తూన్నపుడు అది పెట్టే ముఖ భంగి మలు పెట్టేదాన్ని. ఇంగ్లీషంటే ప్రస్తుతం మావారిమీదలా అమితమైన ముద్దు. కానీ ఆయనకి పుట్టక ముందునుంచీ ఇంగ్లీ షంటే తగని చిరాకు. "ఈ ప్రపంచంలో పడి ఇంగ్లీషు మధ్య నే నెలా బ్రతకనురా భగవంతుడా" అనుకుంటూనే ఆయన పుట్టారనీ అందుకే పుట్టగానే క్యారు కాం మని ఏడ్చాననీ ఆయన చెబుతూంటారు. లాంగ్వేజి విషయంలో ఇంత డిఫరెంసు వున్న మేము డికాషనూ, పాలూ కాకుండా ఎలా వుంటాం చెప్పండి. ఇవన్నీ అటుంచి, డికాషను పాలు కలిపి శ్రేష్టమైన కాఫీ తయారైనట్టే మా సంసా రమూ "ఓ హేపీహోం" కింద తయా రైంది. అందుకే ఎవరన్నా కొత్తగా పెళ్ళయిన వాళ్ళని "డికాషనూ పాలలా కలిసి పోయి ఆనందంగా జీవించండి" అని మనసారా దీవిస్తుంటాను నేను.

ఇలా ఆలోచిస్తూండగా స్టవ్వుమీది కాఫీ మరిగి పొంగిపోవడం చూసి ఈ లోకంలోకి వచ్చాన్నేను. (ఇందాక

చెప్పిన లైన్లలోనే ఇలా కాఫీ మరిగి పొంగి పోవడమూ కూడా చూపిస్తే దర్శ కత్వం ఎలా వుంటుందన్న విషయం ఆలోచించరాదు.)

కాఫీ నొక కప్పులోకి వంచి ఆయన పడుకున్న మంచం దగ్గరి కెళ్లాను. నే నిలా కాఫీ తీసు కొస్తున్నట్టు ఆయనకి తెలిసినట్టుంది. దొంగ నిద్దరపోతూనే చిరునవ్వులు కురిపిస్తున్నారు

"మిమ్మల్నే" అన్నాను.

ఆయన మూసుకున్న కళ్ళతో నవ్వు తూనే.

"ఏవిఁటది" అన్నారు.

ఇంతవరకూ మా సంసారాన్ని డికా షనూ పాలూ కలిసిన 'కాఫీ'తో పోల్చుకుని దర్శకత్వం వహించుకున్న నేను.

"అదే మన సంసారం" అన్నాను.

"వాట్!" అంటూ వులికిపడి లేచి కూచున్నారాయన.

'అదేలెండి కాఫీ' అన్నాను ముసిముసి నవ్వులు పారబోస్తూ.

నా చేతిలోని కప్పు అందుకుని కాఫీ చప్పరించి, నా వేపు ప్రశంసా పూర్వ కంగా చూస్తూ "వాఁ" అన్నారు.

"కాఫీ ఎలావుంది" అన్నాను పక్క మీదుగా జరిగికూచుంటూ

ఆయన శూన్యంలోకి చూస్తూ



"కాఫీ! ఓ కాఫీ! నా యువకాశల నవ పేశల సుమ వంటింటావర ణంలో నిను నే నొక సుము హూర్తంలో "

"బాబ్బాబు ఇక చాలు ఆపం డి" అన్నాను నేను తల పట్టు కుంటూ.

(ఆయన కపుడపుడు ఇలా

శ్రీశ్రీ పూనుతుంటాడు. ఒకసారి వచ్చా డంటే త్వరగా వదల్డు మరి. నాకు తెలు గంటే అసహ్యమని తెలుసు గనక మరీ విజృంభించి పోతారాయన)

ఆయన నా మాట పట్టించుకున్నట్టు లేదు.

"వారెవా, పొద్దున్నే ఏం కాఫీ యిచ్చావు డియర్ ఇది తాగితే

"మరో ప్రపంచం, మరో ప్రపంచం,
మరో ప్రపంచం పిలిచిందీ.
పద డియర్ ముందుకు, పద
శ్రీమతి తోసుకు పదరాణీ పోదాం
పైపైకి కాఫీ తాగుతూ
పదంపాడుతూ వా్రెవా "

నాకో్కపం రెచ్చిపోయి దిగ్గునలేచి నుంచున్నాను.

"ఆగమ్మాయ్ పారిపోకూ" అంటూ నా కొంగు చేత బుచ్చుకు వెనక్కి లాగారు. ఆ వూపుకు వెనక్కెళ్ళి ఆయన ఛాతీమీద బోర్లాపడ్డ నన్ను గట్టిగా ఒడిసి పట్టుకుంటూ మొదట్లో పసిపిల్లాడిలా అమాయకంగా కనబడ్డపుడు నే చేద్దామను కున్న పని చెయ్యబోయారు.

"వొదలండి పొద్దునే ఏవిటీ పని? మీ నోరు వాసనేస్తూంది" అన్నాను.

ఆయన కొంటెగా నవ్వుతూ "కాఫీ వాసనా" అన్నారు "కాదు శ్రీ. శ్రీ వాసన నేనది భరించలేను." అన్నా తప్పించుకోబోతూ.

నన్నాయన మరికాస్త గట్టిగా గుండె లకుహత్తుకుంటూ.

"ఉండాలోయ్ కవితావేశం. దొరక దటోయ్ శోభావేశం కవిత్వ మొకతీరని దాహం" అన్నారు నా ఎదాల నుంచిం బోతూ.

"అమ్మదొంగా పరగడుపున యీ పాడుపనులా" అని నేను మనస్సులో ఇంగ్లీషులో అనుకుని, ఆయన చేతు ల్నించి విడిపించుకుని వంటింట్లోకి తుర్రు మన్నాను.

మా వారు నిరాశ చెందినట్టున్నారు.

"వేళకాని వేళలలో, లేనిపోని వాంఛ
లతో దారికాని దారులలో, కానరాని
కాంక్షలతో దేనికొరకు పదేపదే
దేవులాడు తావ్" అని.

శ్రీ శ్రీ భాషలోనే తనని తనే తిట్టు కుంటూ పేస్టు వేసుకుని బ్రెష్షుతో బాత్రూమువేపు నడిచారు. పళ్ళు తోము కోవడం పూర్తిచేసినా బాధతీరలేదేమో బాత్రూములోంచే.

"పతులార! భ్రష్టులార! బ్రతుకుకాలి పనికిమాలి.

దీనులార హీనులార ఏడవకండేడవ కండీ" అని అరుస్తూన్నారు.

"మరీ పసిపిల్లాడిలా బిహేవ్ చేస్తారు. అందునా ఆదివారమొస్తే పట్టపగ్గా లుండవు" నేను నవ్వుకుంటూ అను కున్నాను పొయ్యిమీద పప్పుడకేస్తూ

ఈ లోగా స్నానంతోపాటూ మరో రెండు పెద్దవి శ్రీ శ్రీ గేయాలు పాడటం పూర్తిచేసి, మల్లెపువ్వులాంటి తెల్లటి పంచె కట్టుకుని వంటింట్లో కొచ్చా రాయన.

వచ్చి వెనకనుంచి నా మీద చేతులు వేసి, పియర్సు సోపు పరిమళాలతో నన్ను నింపేస్తూ "ఇపు దేవాసనొస్తున్నా"




అన్నారు చిలిపిగా.

నేను రవంత కోపం నటిస్తూ "మీ శ్రీ శ్రీ ముందు పది పియర్సు సోపులైనా పణ్జెయవులెండి" అన్నాను

"మా గురూగారిని పరగడుపునే తిట్టి నా కనవసరంగా కోపం తెప్పించకు దుష్టబాలికా" అన్నారు ఆయన చిరు కోపంతో. (బహుశా నటిస్తూనే)

"ఏం జేస్తారు" అన్నా తల ఎగరేసి,

ఆయన కామాటకి నిజంగానే కోపం వచ్చినట్టుంది. నన్ను ముందుకు తిప్పు కుని గట్టిగా కవుగలించుకుని గాఢంగా ముద్దు పెట్టేసుకున్నారు. నాకు అప్పుడు అమితంగా కోపం వచ్చేసింది. "మీ పంతవేఁ నెగ్గిందనుకోకండి" అని మన సులో అనుకుని ఆయన అందమైన క్రాపు లోకి వేళ్ళుపోనిచ్చి ముందుకు లాక్కుని మరింత గాఢంగా మరో ముద్దు పెట్టు కున్నాను.

(ఇక్కడో విషయం వివరించాల్సి వుంది. ఏ సంసారపు జంటా 'ఒకముద్దు' పెట్టుకోకూడదని ఓ హేపీ హోము రూ లుందట. అలా పెట్టుకుంటే ఆడపిల్లలు పుడతారన్న భయమూవుంది అలా ఆడ పిల్లలు పుడితే ఇబ్బందేదీ లేకపోయినా, వాళ్ళందరూ రేపు రచయిత్రులై పోతే వాళ్ళకి కాగితవూఁ, పెన్నులు, ఇంకులూ, పోస్టేజి ఖర్చులూ సప్లయి చెయ్యాడవేఁ కష్టమని మా వారి ఆర్గ్యుమెంటు. పైగా ఒకముద్దే పెట్టుకుంటే అది పెళ్ళాంముద్దో మొగుడి ముద్దో అవుతుంది. కనక ఇద్దరూ తమ తరపున చెరోటీ పెట్టుకు తీరాలన్నది మా బుల్లి సంసారంలో మేం పెట్టుకొన్న బోలెడన్ని రూళ్ళలో ఒహటి)

నేనిలా 'రెండు ముద్దులరూలు' గురించి మురిసి పోతూండగా సతీ సావిత్రి నాటకంలో మొండి సావిత్రి యంటీ రామారావుని అడిగినట్టుగా "ఒహాటి నేనిస్తిని. మరోటి నీ వడిగితివి మరి ముచ్చటగా మూడోదేదీ" అన్నారు.

"మూడో దెందుకూ."

"అదికాదు డియర్, ఒకటి నీది, ఒకటి నాది. మరి శ్రీ. శ్రీ దేదీ?"

"హమ్మా! ఈ మాటవింటే మీ శ్రీ. శ్రీ మీ మీదకి కోపంతో జగన్నాధ రథచక్రాల్ పంపిస్తాడు జాగర్త' ఈపప్పు లేవీ ఇక్కడ వుడకవు" అన్నాను స్టవ్వుమీద వుడుకుతూన్న పప్పును కలుపుతూ.

ఆయన తిరిగి నిరాశ చెందినట్టున్నారు.

"హం: ఏయింటి చరిత్ర చూపినా ఏ మున్నది గర్వకారణం.

పతి జాతి చరిత్ర సమస్తం సతిపీడన పరాయణత్వం'" అని వాపోయారు.

నేను ఆయన దుఃఖాన్ని పోగొట్టాలనీ (కనీసం అలా పోగొడితేనన్నా శ్రీశ్రీ గేయా లాగిపోతాయేమోనన్న సదుద్దేశ్యంతో)

"మార్నింగ్షోకెళతున్నాను, పది గంటలకి. మీరీ వంటపని చూసుకోండి" అన్నాను.

ఆయన అసంతృప్తికి ఆజ్యం పోసినట్టయింది.

"పోనీ, పోనీ పోతే పోనీ
సతుల్, సుతుల్, హితుల్
పోనీ, పోతేపోనీ, పోనీ!" అన్నారు పాటరూపంలో.

ఆ పాట వింటూ కూచుండగా పొయ్యి మీద పెట్టిన పప్పు మాడిపోయి పొగలు వచ్చాయి.

అది గమనించి ఆయన కంగారుగా అటువేపు చూపిస్తూ "చూడు చూడు నీడలు—నీడలు పొగమేడలూ" అనరిచారు.

నేను పప్పుగిన్నె దింపి గిన్నెలోకి చూసాను. లోపల కనుపించిన వస్తువు సంవత్సరానికి సరిపడే కాటుకలా అగుపించింది అది చూసి నా కేడుపొచ్చినంత పనయింది.

"వెధవది, ఇవాళ ఆదిలోనే హంస పాదుపడిందే, ఇహ మిగతావన్నీ ఎలా పూర్తి చేయాలి" అన్న ఆలోచన వచ్చి బోలెడంత నీరసం ఆవహించింది.

"పోనీ, కానీవోయ్ రసనిర్దేశం!" అన్నారు.

"ఇపుడు నేనా రసాలూ, సాంబార్లూ పెట్టలేను" అన్నాను విసుగ్గా.

అందుకాయన నవ్వుతూ చెయ్యి పుచ్చుకుని "పెళ్లాం ఓ పెళ్ళాం! నా యువ కాళల నవపేశల సుమగీతావరణంలో నిను నేనీ సుముహూర్తంలో "అంటూ ఆపి ఆపైె గుర్తుకాక "పద త్వరగా డ్రెస్సవ్వు మార్నింగ్షో కెళ్ళి, ఆ తర్వాత హోటల్లో భోజనం చేసొద్దాం" అన్నారు.

ఏ మాట కామాటే చెప్పాలన్నరూలుంచే నిజం చెప్పేస్తున్నాను. నాకా క్షణం శ్రీశ్రీ అంటే ఎపుడూ లేనిది, బోలెడంత ప్రేమ పుట్టుకొచ్చిందంటే నమ్మండి.

(శ్రీశ్రీకి క్షమాపణలతో)






దేవతార్చన ముగించుకొని బయటికి వచ్చాడు పరశురామయ్య పంతులు. భ్రమరాంబాష్టకం పఠించుకుంటూ బయటికి వచ్చిన అతనికి వసారా చివర నుంచున్న గేబ్రియల్ కనిపించేడు.

పరశురామయ్యగారు రాగానే ముందుకి వచ్చి నమస్కరించేడతను. గేబ్రియల్ నమస్కారాలందుకుని తలూచాడుఆయన.

"రమ్మన్నారట బాబుగారూ?"

"అవున్రా. పనిమీదే పిలిపించాను. నీకు పొలమేమీ లేదు కదా?"

"లేదు బాబయ్యా! ఇరవై సెంట్లు పాటిదిబ్బుంది. ఏదో కూరగాయలు పండించుకుంటూ వున్నానండీ!"

"నీ కొడుకు కూడా చేతికి వచ్చేడు కదట్రా."

"అయ్యా."

"వాడిని రామిరెడ్డి ఇంట్లో జీతానికుంచేవు కదూ?"

"అయ్యా."

"ఉగాదితో పని అయిపోతుంది కదూ?"

---

యామినీ సరస్వతి

"అయ్యా."

అతని విచారింపులన్నీ ఎందుకో అర్థం కాలేదు.

"ఒరే గేబ్రియల్! నీవు బాగా కష్ట పడతావురా. నీ కొడుకూ అంతే. అయినా మీకు సరిపోవటంలేదురా! తిండిగింజలకే కటకటలాడుతున్నారు కదరా! మీ అమ్మ, నీ భార్య, నీ విధవక్క—దాని కూతురూ ఇంతమంది కూలికి చేసుకుంటున్నా ఏం మిగులుతోందిరా?"

"ఏం మిగులుతుంది బాబయ్యా? రెక్కలు ముక్కలు చేసుకునేట్టు కష్ట పడటం - శ్రమ మరిచిపోయేట్టు తిని నిద్ర పోవటం మిగులుతోంది అంతే!"

"అదేరా నేను చెప్పేదీనూ ఒరే నా మాటొకటి వింటావుట్రా."

"చెప్పండి బాబయ్యా!"

"నాకు అయిదెకరాల బంజరూ, మా తమ్ముడికి అయిదెకరాల బంజరూ గవర్న మెంటువాళ్లు యిచ్చార్రా. అది సాగు చెయ్యాలి. మీరయితే కష్టపడి బాగు చేస్తార్రా. తల్లీపిల్లా తిప్పలుపడితే ఏడాది తిరిగేసరికల్లా బంగారు పండుతుందిరా."

జవాబు చెప్పలేదు గేబ్రియల్.

"నీవద్ద ఏమీ లేదని నాకు తెలుసు లేరా! వ్యవసాయమంటే మాటలు కాదు. డబ్బుండాలి. అందుకే నీ కొడుకుని అర్జీ రాసివ్వమను. ఎద్దుల జతకి లోన్ యిప్పి స్తాను. సిండికేట్ బ్యాంక్‌లో నీ పేర క్రాప్ లోన్ యిప్పిస్తాను. ఫారం రెప్రి జెంటెటివ్ శేషాద్రిశర్మతో మాట్లాడేను. తక్కువ వడ్డీ - ఖర్చుకి తగినంత ఇస్తారు. వడ్ల ధర విపరీతంగా వుంది. ఏ పంట గింజలు అప్పుడే అమ్మేసి బ్యాంకలో జమకడుతోంటే మళ్ళీ మళ్ళీ యిస్తుం టారు. నాలుగైదేళ్ళు కష్టపడ్డావా నీ కుటుంబం బాగుపడుతుంది. నాలుగు రాళ్లు వెనకేసుకొని ఏదో ఓ ఎకరం కొను క్కోవచ్చు" అన్నారు పంతులుగారు.

అతని కళ్ళల్లో ఆశలు మెదిలేయి.

అన్నివిధాలా అండ చూపుతున్నాడు. తనదల్లా శరీర కష్టం. అది పుట్టుకనుంచీ వుంది. అంతే. మంచి అవకాశం పిలిచి బాగు పరుస్తున్నాడు మహానుభావుడు అనుకొని "మీ దయ బాబుగారూ!" అన్నా డతను

పరశురామయ్య కళ్ళు గర్వంగా మెరిసేయ్

"మునసబుగారి కాలువనుంచి యాభై గజాల కాలువ తవ్వితే అయిపోతుంది పని. నీళ్ళు జలజలా మన పొలంలో దూకుతాయ్. కష్టపడాలిరా గేబ్రియల్! కష్టే ఫలి అన్నారు. శ్రమపడితేనే పంట ఇంటికొస్తుందిరా. ఈ సంవత్సరం నాకు గుత్త అక్కర్లేదులేరా! పన్ను కట్టుకో చాలు. వచ్చే ఏటినుంచి ఎకరానికి మూడు బస్తాలివ్వు చాలు."

గేబ్రియల్‌కి ఆశ్చర్యంపై ఆశ్చర్యం కలుగుతోంది. అయినా చల్లని ప్రభు వులు గ్రామాధికారులంటే వూరికి తల్లి దండ్రులవంటివారు అనుకున్నాడు.

"అలాగే బాబయ్యా" అని ఆదరంతో అంగీకరించాడు.

"ఒరే యిది గవర్నమెంటువాళ్ళిచ్చిన భూమి. దీన్ని కౌలుకు యిస్తే ఏ తంటా వస్తుందో. అందుకే రాతకోతలు ఏమీ




వద్దు. మాటలే."

"బాబయ్యా! మీ మాట చాలదూ! కాగితాలు కావాలా? మంచి రోజు చూసి పనిచేసుకుంటాను. మీ దయ వుంటే చాలు" అని సెలవు తీసుకున్నాడు.

* . * *

గవర్నమెంటు యిచ్చిన డబ్బుతో సుమారైన గిత్తెద్దులు కొన్నాడు. అయిదెకరాలకి మూడువేలు యిచ్చింది సిండికేట్ బ్యాంక్. ఆ డబ్బల్లా అయ్యగారి పుణ్యంగానే భావించేడు గేబ్రియల్.

తొలకరి చినుకులు పడ్డాయ్. నేల మెత్తనైంది. కొడుకుని కాడికట్టుక రమ్మని పొలానికి కదిలేడు గేబ్రియల్. పదెకరాల పొలం. ఎటు చూసినా పొలమే. చుట్టూ సాగుచేసిన భూమి. రైతులు దున్నుకుంటున్నారు. ఈ పొలంలో మాత్రం నిలువెత్తు పెరిగిన జంబుగడ్డి గంటలు గంటలు కట్టి ముదిరిపోయి పశువులకి కూడా కొరకరాని కొయ్యగా తయారైన గడ్డితో పాండవ బీడులాగా ఉంది.

"ఇంత గడ్డిగత్తరా పెరిగిందంటే యిందులో సారం వున్నట్టే" అనుకున్నాడు గేబ్రియల్. అతనితో వచ్చిన భార్యా, అక్క, కోడలు నిరాశగా చూసేరు దీన్ని ఎప్పుడు సాగులోకి తీసుకురావాలా అని.

"ఏమిటే అట్లా చూస్తారు? కొడవలి తీసుకొని కోయండి."

"ఏందయ్యా! దీన్నెట్టా దున్నతావ్?"

"ఒరే ప్రకాశం! మనిషి చదువు కోవాల్రా అంటే వినకుండా పశువులు కాశావు. నోట శుద్ధమైన ముక్క రాదు. ఆదివారంనాడైనా బైబిల్ ముట్టుకొనే యోగ్యత లేదు. చదువుకోంది ఆలోచన పొర్లదు. అంతా బాగా తయారైన పొలం మన కెవరిస్తార్రా? పుట్లు పండుతోంది భూమి. కౌలుకిచ్చే నాథుడెవరు? అయ్య

గారు దయతలచి యిచ్చారు. డబ్బిప్పిచ్చారు. పశువులు కొనిచ్చారు. సాగు చేసుకుంటే బంగారం పండించవచ్చు. ఆడోళ్ళు కోస్తారు. నీవు బాగా దున్ను. గడ్డి కుప్పగా వేద్దాం. నీళ్ళు రాగానే కుళ్ళబెడదాం. ఇవి ఎంత ఎరువనుకున్నావ్రా?"

"ఏందోనయ్యా! నాకేం బాగుండ్లా!"

"వెధవ సన్నాసి! పని చేయరా ఫలితం చూస్తావు. చూపుతాను" అని కాలువ తవ్వటం ప్రారంభించేడు గేబ్రియల్. ఆడవాళ్ళు కోతకి వంగేరు. నాగలికి ఎద్దులకి దండం పెట్టుకుని దేముడు లాంటి తండ్రికి మొక్కి కాడి కట్టేడు ప్రకాశం.

చూసేవారికి ఆశ్చర్యకరంగా, వినే వాళ్ళకి కుతూహలకరంగా, శ్రామికులకి మెప్పుకోలుగా, సోమరులకి కన్నుకుట్టుగా పని చేశాడు గేబ్రియల్. కుటుంబంతో పంతం పట్టి పనిచేయించాడతను.

కే. పి. కెనాల్లో నీరు వదిలేసరికి పొలం చూసేట్టుగా తయారైంది. కాలువలో నీరు వదలడం తరువాయి పంటకాలువగుండా గలగలా ప్రవహించి వచ్చాయి నీళ్ళు. ఆ సరికే అడ్డకట్టలూ నిలువు కట్టలూ వేసేశారు. పొలం చదును చేశారు. భూమి గుల్లగా దున్నేరేమో నీరు బుసబుస లాడుతూ ఒక్కరోజులో అయిదెకరాలూ తడిసి కంటికింపుగా తయారైంది.

నారుమడి దున్నుతోన్న కొడుకుని చూసి "ఒరే ప్రకాశం. రెండు నెలలకి పూర్వం యిదెలా వుండిందో నే చెప్పక్కర్లా. పక్కనున్న ఆ అయిదెకరాలూ చెపుతున్నయ్. ఇపుడు చూడరా ఎలా వుందో! ఒరేయ్! తీస్తువుంటే కొండనైనా పూర్తిగా తీసేసి కదిలించొచ్చురా! మనిషికి సాధ్యం కానిది లేదు. ఎలా అని భయపడి చూస్తూ కూర్చుంటే ఏదయినా అలాగే వుండిపోతుంది. తలపడి పని సాగిస్తే సాధ్యంకానిది లేదు. అంతా భగవంతుని కృప" అన్నాడు.

"అవునే అయ్యా! మీ తరమోళ్ళకి పట్టుదలలు జాస్తి. ఇంతయితదని నే నను కోలేదే!"

గట్టిగా వున్న మట్టి పెళ్ళలని చిదమ గొడుతూ "అవున్రా! మనిషన్నవాడు చేసి చూపించాలి" అన్నాడు గేబ్రియల్.

అందరితో పాటే దమ్ముచేసి నాటు వేశాడు అగ్రికల్చరల్ డిపార్ట్మెంటు వాళ్ళు ఇచ్చిన కొత్త విత్తనాలు ఆర్. పి. 4-14 తెచ్చి నారు పోసి నాటేరు. మన్ను వాసన చూసి యిది బంగారం పండుతుంది అనుకున్నాడు. జింక్ సల్ఫేట్ వేయమంటే వేశాడు. సూపర్ పాస్ఫేట్ వేశాడు. పశువుల ఎరువూ పచ్చి ఆకు రొట్టా బాగా వేశాడు.

నాటువేసిన పదిరోజులకల్లా కట్టు వెలితి పోకుండా అతికి బ్రతికి ఆనందం కలిగించింది. గేబ్రియల్కి పొలమే సర్వస్వం అయింది. గట్టున్నే ఒంటి నిట్రాటి పాక వేసుకున్నాడు అతను, నిద్రకి మాత్రమే అతనింటికి వెళుతున్నాడు. పాకచుట్టూ వేసిన జపాన్ ములగ ఏపుగా రోజు రోజుకి విపరీతంగ పెరుగుతూ చల్లదనాన్నిస్తోంది.

సమయానికి కలుపు తీశాడు. పై ఎరువులు వేశాడు. తెగులు చూపితే స్వయంగా మందులు స్ప్రే చేశాడు. రోజులు

నాటిన వాళ్ళ పొలాలు ఏపుగా ఎత్తుగా పెరిగి మనుషుల్ని సవాలు చేస్తున్నాయ్. తనూ అది నాటక పొరపాటు చేశానా అని అనుకుంటున్నాడు గేబ్రియల్. మందులపై మందులు చల్లుతూ ఎరువులు వేస్తూ పొలాన్ని కంటికి రెప్పలా కాచుకుంటూ వున్నాడు.

డిసెంబర్ వచ్చేసింది కుప్పనూర్పిళ్ళయాయి.

గింజలన్నీ ఇల్లు చేరాయి.

"నేసెప్పలా అయ్యా! రేయింబగుళ్ళ రెక్కలు ముక్కలు సేసుకుంటే మనకు మిగిలిందేంది? గడ్డి! అదయినా ఎంతుంది, బట్టిగొడ్లకి సాలదు."

కొడుకు నిష్ఠూరాలకి అతను జంక అప్పు కట్టేడు. వాయిదాకి లోను కట్టేశాడు. వెళ్ళి పన్ను చెల్లించాడు. "ఒరే! నీకేం గిట్టుబడి కాలేదు కదరా! పాపం." అన్నాడు పరశురామయ్య.

"ఈ పంటపోతే ఇక ప్రపంచం మునిగిపోయిందా అయ్యగారు. భూమమ్మను నమ్మినవాడు చెడడు. ఈసారి పండుతుంది. పండిస్తాను" అన్నాడు గేబ్రియల్.

"దేశంలో అంతా నీలాటి రైతులే వుంటే సస్యశ్యామల మవుతుందిరా దేశం" అన్నాడాయన. గేబ్రియల్ ఇంకేమీ అనకుండా సెలవు తీసుకుని వచ్చాడు.

మిగిలిన పదిరూపాయలూ ఆనందంగా తీసికెళ్ళి భార్యకిచ్చేడు.

మూతి మూడు వంకర్లు తిప్పిందామె.

"ఇదిగో ఇలా చూడు! ఇలాంటి పదులు వందలు ఇస్తానే క్రీస్తు దయ వుండాలి." అన్నాడు ధైర్యం కురిసే కళ్ళతో చూస్తు.

* * *

పట్టు విడవని విక్రమార్కు-డిలా మళ్ళీ పని ప్రారంభించేడు గేబ్రియల్ చేతుల కష్టం మిగల్లేదు. తినటానికి కూరగాయలు తిండి పెడుతున్నాయ్. వ్యవసాయాన్ని నమ్ముకుని చెడిన వాడు లేడు ఆ పంట పోతే యీ పంటపోతుందా అనుకున్నాడు జయ పైరు నాటేడు. క్షణ క్షణంగా పెరుగుతూ వచ్చింది పైరు.

రోజులు గిర్రున తిరిగేయ్ కాలచక్రం ఆగదన్నట్టు.

వందేభై బస్తాల ధాన్యం పండింది. వెంటనే అమ్మేడు సగం ధాన్యం. లోను కట్టేడు మూడు వేలూ! పశువుల లోను వెయ్యీ తీర్చేశాడు పన్ను చెల్లించేడు. పై పై ఖర్చులకి తెచ్చిన తొమ్మిదొందలూ తీర్చేశాడు.

ఇంకా డెబ్బయిబస్తాలకి పైగానే మిగిలేసి తినటానికి వుంచుకుని మిగిలినవీ అమ్మేడు. వచ్చిన అయిదువేలూ భార్య చేతికిచ్చి క్రీస్తు ముందుంచమన్నాడు.

అతని కళ్ళల్లో గర్వం తొణికిసలాడింది. సగం తెలుపూ సగం నలుపుగా వున్న బుజ్జి మీసాలు గర్వంగా దువ్వుకున్నాడు. "ఇదిగో బంగారాన్ని పండించేను. అయ్యగారికి నూటపదార్లు దక్షిణ యిచ్చొస్తా!" అని బయల్దేరాడు. ఇంటిల్లిపాదీ సంతోషంగా అంగీకరించారు. తను వేసిన మునగచెట్టు కాయలూ, చేలో పండిన సొరపిందలూ తీసుకుని వెళ్ళమని ఇచ్చింది అతని భార్య.

* * *

గేబ్రియల్ వెళ్ళేసరికి పరశురామయ్యా నాగభూషణరెడ్డి ఏదో త్రీవంగా ఆలోచిస్తూ మాటాడుకుంటున్నారు.

"రా! రా! గేబ్రియల్! నీ మాటే అనుకుంటున్నాం. కొలంబస్ లాంటి వాడివి నువ్వు అందరూ పాడుబడ్డదనుకున్న దాన్లో వజ్రాలు వెలికి తీశావు. ఇదిగో ఇతన్ని చూడు పిరికి వెధవ. ఆ మిగతా అయిదెకరాలూ వేసుకోమంటే జంకిచస్తున్నాడు"

"ఇదంతా మీ చలవే బాబయ్యా! కష్టపడితే పండని భూమి ఏదుంది? చదువు చెపితే రాళ్ళయినా నేర్చుకుంటాయట పండిస్తే పాడుభూములైనా పండుతాయ్."

"అవున్నా మీరంతా కష్టపడతారు. నే నొంటివాడిని. మీలా తిప్పలు పడలేను"

"పోనీ ఆ అయిదెకరాలూ నీవే తీసుకుంటావా?" అడిగేడు పరశురామయ్య నాగభూషణం ఆ మాట అనటంతో.

"వద్దు బాబయ్యా! ఆశకి అంతుండాలి! ఈ అయిదెకరాలూ పండించుకుంటే చాలు. మా వాడూ ఇప్పుడలాగే అన్నాడు. ఉన్నదంతా కావాలని కావలించుకొనే బదులు ఉన్నది కాస్తా బాగుచేసుకొంటే చాలు అన్నానయ్యా!"

"అయినా నీవు గట్టివాడివిరా! సాధిస్తావు" అన్నాడుడుబ్బేస్తూ పరశురామయ్యా.

జవాబు చెప్పలేదు గేబ్రియల్.

"అయితే నీ కింకా పొలం అక్కర్లే




దట్రా!"

"వద్దండీ!"

"ఒరే రెడ్డీ! నీకూ ఆ పొలం అక్కర్లే దట్రా!"

"ఎందుకండీ నాకు! అంతా కష్టపడి సాగుచేస్తే ఏం మిగులుతుందో! సాగైన దైతే ఫరవాలేదు. అసలు దీనికి ట్రాక్టరు దున్నించటానికే బోలెడవుతుంది. పోనీ సాగయింది యింకొకరి పొలం చూసు కొంటాను."

రెండు నిమిషాలు నిశ్శబ్దంలో గడిచి పోయాయి.

"ఇదిగో గేబ్రియల్! నాదో మాట వింటావా?"

"చెప్పండి బాబయ్యా!" అన్నాడు వినయంగా.

"నీవూ నీ కుటుంబమూ అంతా బాగా కష్టపడేవాళ్ళే. ఇంకో సంవత్సరం కష్ట పడితే అదీ బాగవుతుంది. ఎవరయినా చేసేవాడికే పని చెపుతారు. బండ కేసుకున్న వాడినెవరూ ఏం చేయలేరు. నా మాట విను" అని ఓ క్షణం ఆగి "ఆ అయి దెకరాలూ నీవే సాగుచెయ్! కాదంటే దానికయ్యే ట్రాక్టరు ఖర్చు నేను భరిస్తా. కాలువ కొత్తగా తవ్వాలి కదా. నేనే తవ్విస్తాను. నీవూ కష్టపడతావు. నాకు తెలుసు. దాన్లోనూ వుండేది మన్నే! పండేదీ బంగారే! కాదంటే మరో ఏడాది కష్ట పడాలి. అదీ అక్కర్లేదు, ఆరు నెలలు చాలు. ఈ పొలం నీడికిచ్చివేస్తాను. అది నువ్వు తీసుకో!

నువ్వు కష్టపడతావు. పండిస్తావు. నీలాంటి రైతులుంటే పొలాలు సస్య శ్యామలాలు అవుతాయ్. ఊరు బాగుపడు తుంది పల్లె బాగవుతే దేశం బాగవు తుంది. నీలాంటివాళ్ళే దేశానికి వెన్నెము కలు. నీ శ్రమకు తగ్గ ఫలితం నువ్వు సాధిస్తావు.

నా మాట విను! ఆ పొలం తీసుకో!"

నివ్వెరపోయిన గేబ్రియల్ తలూపేడు, మట్టి చేసుకున్న చేతుల్ని కడుక్కునే శక్తిలేక!



# మగాళ్లు ఎక్కువేంటి?

రెక్కాడితేగాని డొక్కాడదు. డొక్కాడినా కడుపు నిండుతుందా? రెక్కాడినా సంవత్సరం పొడుగునా ఆడుతుందా? వ్యవసాయ తరుణం పూర్తి అయింతర్వాత ఏంజేసి బ్రతకాలి? మన గ్రామీణ ప్రాంతాల్లోని కోట్లాది వ్యవసాయ కూలీలు వేసుకొనే ప్రశ్నలివి.

ఏది ఏమైనా చేసిన శ్రమకు తగిన ప్రతిఫలం వారికి ముట్టాలి. పెద్ద పెద్ద భూస్వాముల దోపిడీకి వారు గురికాకుండా చూడాలి.

వ్యవసాయ కూలీల కనీస వేతనాల చట్టం మన రాష్ట్రంలో అమలు జరుగుతోంది. ఆ యా కాలాలలోని పరిస్థితులనుబట్టి ప్రభుత్వం యీ కనీస వేతనాలను పెంచి, కార్మికులకు న్యాయం కలిగేటట్లు చూస్తుంది. 1974 ఆగష్టు నెలలో కనీస వేతనాలను సవరించారు. మళ్ళీ, 20 సూత్రాల పథకం అమల్లోకి వచ్చిన తర్వాత 1975 డిసెంబరు 2 వ తేదీనుండి కనీస వేతనాలను పెంచారు

కనీస వేతనాలు రాష్ట్రమంతటా ఒకేవిధంగా వుండవు. ఆ యా మండలాలలో, పరిస్థితులను బట్టి నిర్ణయిస్తారు. రాష్ట్రాన్ని 3 మండలాలు చేశారు. వ్యవసాయ కూలీలకు ఆ యా చోట్ల సాలుకు రు. 1,400, రు. 1,100, రు. 900 వరకు వేతనం వస్తుంది.

స్త్రీ పురుషులకు యిప్పుడు సమానంగా వేతనం యిస్తున్నారు.

వ్యవసాయ కూలీలలో అధిక సంఖ్యాకులు హరిజనులూ, యితర బడుగు వర్గాల వారూ.

ఇరవై సూత్రాల పథకం సమాజంలోని బడుగు వర్గాల అభ్యున్నతికే పుట్టింది. వీరి అభ్యున్నతి కేవలం మాటల్తో రాదనీ, చేతల్తోనే వస్తుందనీ ప్రభుత్వం భావిస్తోంది.

---

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

**DIPR. 16/76-77**

# సినిమా

## అన్నపూర్ణా పిక్చర్స్ సిల్వర్ జూబిలీ

అన్నపూర్ణాపిక్చర్స్ సంస్థ రజతోత్సవ సంవత్సరంలో అడుగుపెట్టింది ఆ సంస్థ నిర్మించే నూతన చిత్ర వివరాలనందిస్తూ యీ విశేషాన్ని వెల్లడించారు నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు. పదిహేనవ చిత్రంగా ఇప్పుడు అన్నపూర్ణా పిక్చర్స్ పతాకం క్రింద తయారవుతున్న 'ప్రేమ లేఖలు' చిత్రం యద్దనపూడి సులోచనా రాణి రాసిన అదే పేరుగల నవలకు చిత్ర రూపం. యువదర్శకుడు కె. రాఘవేంద్ర రావు దర్శకత్వంలో మురళీమోహన్, జగ్గయ్య, సత్యనారాయణ, గిరిబాబు, అల్లు రామలింగయ్య, అనంత్‌నాగ్ (హిందీ చిత్రం 'అంకుర్' ద్వారా మీకు పరిచితుడే!), జయసుధ, దీప నటిస్తున్నారు ఈ చిత్రంలో హైదరాబాద్ సారధీ స్టూడియోలో నిర్మాణం కాబోతున్న ఈ చిత్రానికి సత్యానంద్ మాటలూ, శ్రీశ్రీ, ఆరుద్ర, కొసరాజు, ఆత్రేయ, డా॥ దాశరధి, గోపి పాటలూ సమకూర్చారు. సంగీతం సత్యం.

## మీరూ సహకరించాలి!

అన్నపూర్ణా పిక్చర్స్ నిర్మాత దుక్కి-

'సుప్రభాతం'లో వాణిశ్రీ





'సీతారామ వనవాసం'లో రవి, జయప్రద

పాటి మధుసూదనరావు 'ప్రేమలేఖలు' చిత్రం వివరాలందించేందుకూ, మద్రాసు లోని పాత్రికేయులను కలుసుకొనేందుకూ ఇష్టాగోష్ఠి సమావేశం ఏర్పాటు చేశారు. 'చిత్ర నిర్మాణంలో పెరిగిపోతున్న వ్యయం, చిత్రాలలో తగ్గుతున్న నాణ్యం, చిత్రపరిశ్రమ ఎదుర్కొంటున్న సంక్షోభం—వీటి గురించి పత్రికాప్రతినిధులు కూడా ఆలోచించాలి. పరిశ్రమ కుపయోగించే విధంగా నిర్మాణాత్మకంగా విమర్శలందిస్తూ, పరిశ్రమ ఎదుర్కొంటున్న సమస్యలను ప్రేక్షకుల దృష్టికీ, ప్రభుత్వం దృష్టికీ, పరిశ్రమ దృష్టికీ కూడా తెచ్చి సహకరించాలి' అని విజ్ఞప్తి చేశారాయన.

## చిత్రాల్లో సాంఘిక ప్రయోజనం

"ఇంతవరకూ నేను డైరక్టు చేసిన చిత్రాలు నాకు తృప్తినివ్వలేదని కాదుగాని సినిమా పరికరాన్ని ఉపయోగించవలసిన విధంగా వినియోగించుకోలేదేమోనని, సినిమాద్వారా సాధించగలిగినంత ప్రయోజనాన్ని సాధించలేకపోయానేమోనన్న ఒక భావనతో 'సుప్రభాతం' చిత్రాన్ని నిర్మించాను" అన్నారా చిత్ర దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు. కె. యస్. ప్రకాశరావు తనయుడు కృష్ణమోహన్‌రావు నిర్మించే ఈ చిత్రం 'ప్రేమించి పెళ్ళి చేసుకొన్నా, పెళ్ళిచేసుకొని ప్రేమించుకొన్నా ఒకటే. ప్రేమించడం ప్రధానం.



'మహానుభావుడు'లో కృష్ణంరాజు

ఆ ప్రేమ చిరకాలం చిగురులు తొడుగుతూ ఉండాలి' ఇదీ సుప్రభాతం చిత్ర కథలోని మూలభావం. కృష్ణంరాజు, వాణిశ్రీలు ఈ చిత్రంలో హీరో, హీరోయిన్లుగా నటించారు.

## కె. ఎస్. రెడ్డి ప్రగతి!

సినిమాలలో నటించాలన్న ఆశతో మద్రాసొచ్చిన ఎంతోమందిలో కె. ఎస్. రెడ్డి ఒకరు. ఆ ప్రయత్నాలు ఫలించక పోయినా నిరాశ చెందక, కృషిలోపమూ చేయక గ్రూప్ డాన్సర్‌గా జీవితం ప్రారంభించి, సోలో డాన్సరై .... మరింత ముందుకు పయనించి నృత్య దర్శకుడిగా రూపొందిన వ్యక్తి కె. ఎస్. రెడ్డి. ఎన్నో చిత్రాలకు నృత్య దర్శకుడిగా పనిచేసిన అనుభవం చిత్ర నిర్మాణ సమయంలో చూస్తూ కూర్చున్న పరిజ్ఞానం కె. ఎస్. రెడ్డిని దర్శకుడిగా కూడా మార్చాయి. ఈయన దర్శకత్వంలో వచ్చిన 'పిచ్చోడి పెళ్ళి' ప్రజాదరణ పొందింది. ఇప్పుడు కె. ఎస్. రెడ్డి చేతిలో రూపుదిద్దుకొన్న చిత్రం 'సీతమ్మ సంతానం'. మురళీకృష్ణా ఎంటర్‌ప్రైజెస్ పతాకం క్రింద కె. మురళీ కృష్ణ నిర్మించిన ఈ చిత్రంలో చలం, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, బాలకృష్ణ, జయసుధ, రోజారమణి, పండరీబాయి, హేమలత, శకుంతల మొదలైనవారు నటించారు. విడుదలకు సిద్ధంగా వున్నదీ చిత్రం.



'కురుక్షేత్రం'లో కృష్ణ, విజయనిర్మల

## అసలుకే మోసం!

స్వర్గంలాంటి ఇంట్లో తాత్కాలికంగా కష్టాలొచ్చినా ఆత్మస్థైర్యంతో నిలబడి నవ్వుతూ, నవ్విస్తూ, అందరికీ తలలో నాలుకలా మెలిగే ఓ యువతి — ఆ ప్రయత్నంలో పాపం భర్త ప్రేమకే దూరంమయింది. అనుమానాల వలయంలో శలభం పరిస్థితి అయింది ఆమె స్థితి. ఆ యువతిని 'జడ్జిగారి కోడలు'గా మీరు తెరమీద చూస్తారు. 'జడ్జిగారు'గా సత్యనారాయణ, 'కోడలు'గా జయప్రద నటించే ఈ చిత్రంలో రామకృష్ణ, రాజబాబు, గిరిబాబు, త్యాగరాజు, కృష్ణకుమారి, హలం, మాధవి మొదలైనవారు



'మనసున్న మనిషి'లో శివాజీగణేశన్

నటిస్తున్నారు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వి. మధుసూదనరావు నిర్వహించిన ఈ చిత్రానికి నిర్మాత కె. ఎస్. రామకృష్ణారావు.

### 'ఫటాఫట్' పుట్టింది!

'ఫటాఫట్' పదం నటి జయలక్ష్మి పేరుకు జతగా కలిసేలా చేసిన చిత్రం బాలచందర్ దర్శకత్వంలో వచ్చిన 'అవళ్ ఒరు తొడర్ కదై' చిత్రం. ఆ చిత్రం విడుదలైనది మొదలు జయలక్ష్మిని 'ఫటాఫట్ జయలక్ష్మి'గానే పిలుస్తున్నారు. తెలుగు అంతులేని కథలో కూడా అదే పాత్ర పోషించిన ఈ తార స్వర్గం-నరకంలో ప్రధాన పాత్ర ధరించి మీ మెప్పు పొందింది. విషయం ఏమిటంటే తెలుగు, తమిళ భాషల్లో నటిగా



పైకొస్తున్న ఈ తార సెప్టెంబర్ 16న పుట్టినరోజు చేసుకొని పత్రికా ప్రతినిధులకు తేనీటివిందు చేసింది.

'భలే దొంగలు'లో ఒక దృశ్యం





'గౌరమ్మా నీ మొగుడెవరమ్మా' లో రామకృష్ణ, వాణిశ్రీ

## రామవిజేతా నూతన చిత్రం!

రామవిజేతా పతాకం క్రింద చక్కని ఇతివృత్తాలతో 'ఇప్పుడు సెన్సారు పెట్టిన కఠిన నిబంధనలు ఎప్పుడో పెట్టినా రామ విజేతా చిత్రాలేవీ ఇబ్బందుల నెదుర్కొనేవి కావనగలిగినంత 'క్లీన్'గా చిత్రాలు నిర్మించ బడ్డాయి. రామవిజేతా సోదరులు—నిర్మాత ప్రభాకర్, దర్శకులు బాబూరావు—. ఇప్పుడు నిర్మిస్తున్న చిత్రం "లంబాడోళ్ళ రామదాసు". ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించ బడిన ఈ చిత్రంలో చలం, జగ్గయ్య, నరసింహరాజు, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, మాడా, రోజారమణి, జయలక్ష్మి (ఫటాఫట్), పండరీబాయి, సుజాత మొదలైనవారు నటిస్తున్నారు. ఎస్. రాజేశ్వరరావు సంగీతమూ, బాలు మహేంద్ర ఛాయాగ్రహణమూ గలదీ చిత్రం.

## 'సావాసగాళ్లు'

నిర్మాత డి రామానాయుడు రెండు వైపులా పదునున్న చాకులాంటివాడు. ఆయన నిర్మించిన చిత్రాలు అందుకు నిదర్శనంగా నిలుస్తాయి. 'పెద్ద దర్శకుడు, పెద్ద తారలూ, పెద్ద బడ్జెట్ అంత ఘనంగానూ చిత్రనిర్మాణం' ఇదీ చేస్తాడు. మధ్యమధ్యలో ఒక మాదిరి తారలు, కొత్తగా సాంకేతిక నిపుణుల పరిచయం, తక్కువ వ్యయంతో చిత్రనిర్మాణం ఇదీ చేయగలడు రామానాయుడు లేటెస్ట్ తెలుగు చిత్రం 'సావాసగాళ్లు' ప్రారంభమైంది. ఆ చిత్రంలో పెద్ద తారలే వున్నారు. కృష్ణ, గుమ్మడి, సత్యనారా



'మనమడి కోసం'లో భానుమతి

యణ, గిరిబాబు, నాగేష్, జయచిత్ర, ప్రభ మొదలగువారు నటిస్తున్నారు. అయితే దర్శకుడిగా బోయిన సుబ్బారావు అనే యువకుడిని ఎంచుకుని చెప్పుకున్నాడు నిర్మాత. ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మితమవుతున్నదీ చిత్రం. ఈ చిత్రనిర్మాణం జరుగుతూండగానే తెలుగులో సూపర్ హిట్ అయిన తమ చిత్రం 'సోగ్గాడు'ని హిందీలో (జితేంద్ర కథానాయకుడిగా) నిర్మాణం ప్రారంభించాడీ స్టార్ ప్రొడ్యూసర్.

## పథకం ఉన్న నిర్మాత!

నటనాశక్తి ఉంది. చక్కని విగ్రహమూ ఉంది — ఎందుకనో నటుడు బాలయ్య అనుకొన్నంత ప్రగతి సాధించలేకపోయాడు నటుడిగా. అలా అని ఏ చిత్రంలోనూ 'బాలయ్య బాగా చేయలేదు' అనిపించుకొన్నదీ లేదు. అదంతా చిత్రసీమలో విచిత్రం అనుకోవచ్చు మరి. అయితే బాలయ్య చిత్రనిర్మాతగా అద్భుత విజయాలు సాధించాడు. నిర్మాతగా మారినా

'పెద్దన్నయ్య'లో రాజబాబు, రావికొండలరావు



ఋుడల చిత్రమే (చెల్లెలి కాపురం) సూపర్ హిట్ అయినా తొందరపడిపోలేదు బాలయ్య. చిత్రానికీ చిత్రానికీ మధ్య ఎక్కువకాలం ఉంటున్నా—ఆ కాలాన్ని తర్వాతి చిత్రంకోసం బలమైన కథ. సరైన నటీనటుల ఎన్నిక, స్క్రిప్టువర్కు ఇటువంటివి పకడ్బందీగా తయారుచేసుకొని నింపాదిగా ఒక పథకం ప్రకారం చిత్రనిర్మాణం సాగిస్తున్నవాడు బాలయ్య. అవును మరి! బాలయ్య ఇంజనీరు. పథకాలు చక్కగా వేసుకోగలడు. ఇప్పుడు బాలయ్య నిర్మించే చిత్రంలో కృష్ణ, బాలయ్య, సత్యేంద్రకుమార్. నాగభూషణం, అల్లు రామలింగయ్య. జయప్రద. జయలక్ష్మి, పండరీబాయి మొదలైనవారు నటిస్తున్నారు. కె.ఎస్.ఆర్. దర్శకత్వంలో, ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకత్వంలో, ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రహణ దర్శకత్వంలో తయారవుతున్న ఈ రంగుల చిత్రానికి కథ కూడా బాలయ్యే సమకూర్చారు.

## మంచికి మరో పేరు!

అప్పుడప్పుడు సంఘం మంచిని అసమర్థతగా పిలుస్తుంది. మంచివాడైన వ్యక్తి అసమర్థుడనీ, అతనేమీ చేయలేడనీ భావిస్తుంది. కాని ఏదో ఒక స్థాయిలో తన మంచితనాన్ని అసమర్థతగా చూస్తున్న సమాజంపై విరుచుకుపడిపోతాడు అంత మంచిమనిషీను. అయితే ఆ సమయంలో కూడా తన మంచితనం వీడక, 'మంచికి మరో పేరే ఈ మనిషి' అన్పించుకోవడం ఎంత గొప్పదో, ఎలా గొప్పదో 'మంచికి మరో పేరు' చిత్రం చెబుతుంది. ఈ చిత్రం రంగుల్లో. పి. ఎస్. రావు దర్శకత్వంలో నిర్మితమైంది. ఎన్.టి. రామారావు, కృష్ణంరాజు, రామకృష్ణ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, నాగభూషణం.

'ఆడవాళ్ళు-అపనిందలు' లో
కృష్ణంరాజు





'మంచిని పెంచాలి'లో కె. విజయ, శ్రీధర్

అల్లు, శరత్‌బాబు, పద్మప్రియ, ప్రభ. జి. వరలక్ష్మి, జయమాలిని, వాణి మొద లగువారు నటించారీ చిత్రంలో. రాష్ట్రపతి 'గోల్డ్ మెడల్' విజేత ఇషాన్ ఆర్య ఛాయాగ్రహణం ఈ చిత్రం ప్రత్యేకా కర్షణ. నిర్మాణ నిర్వహణ జగన్నాథ్, నిర్మాత ఎం. మనోహర్.

## అమ్మాయి అమెరికాదయితేనేం!

'నీనా' పుట్టింది అమెరికాలో. ఎన్నో దేశాలు తిరిగి, అన్ని రకాల సంస్కృతు లనూ అర్థం చేసుకొంది. భారతీయుడిని పెళ్ళిచేసుకొంది. అదీ తెలుగు యువకుడిని. ఈ దేశం రాగానే ఉన్నతమైన మన ఆచా రాలు, సంగీత, సాహిత్య, సాంస్కృతీ రంగాలు చూసి ప్రభావితురాలై కట్టు, బొట్టు మార్చుకొని భారతీయ నాగరికతకు జోహారు చేసింది. అయితే భారతదేశంలో పుట్టిన సుధ విదేశాలు చూడకపోయినా 'నక్కవాత' లాగా పాశ్చాత్య నాగరికతా ప్రభావానికి దాసురాలై తన వైవాహిక జీవితానికి భంగం తెచ్చుకొనే ప్రమాదంలో పడింది. ఈ అమెరికాఅమ్మాయి భారతీయ వనిత "అమెరికా అమ్మాయి" చిత్రంలో కన్పిస్తారు మీకు. అమెరికా అమ్మా యిగా దేవయాని (ఛమ్మాటి అన్నె) ఆమె భర్తగా శ్రీధర్, భారతీయ వనితగా దీప. ఆమె సరసన రంగనాథ్ నటిస్తున్న యీ చిత్రాన్ని సింగీతం శ్రీనివాసరావు దర్శ కత్వంలో ఎన్. కృష్ణంరాజు నిర్మిస్తు న్నారు.

## మన్నించాలి!

శోభన్‌బాబు (శ్రీకృష్ణుడు), కృష్ణ (అర్జునుడు), బాలయ్య (ధర్మరాజు) రణధవే (భీముడు) సత్యనారాయణ (దుర్యోధనుడు) నాగభూషణం (శకుని) కృష్ణంరాజు (కర్ణుడు) గిరిబాబు (దుశ్శాసనుడు) చంద్రమోహన్ (అభిమన్యుడు) రాజబాబు (లక్ష్మణకుమారుడు) గుమ్మడి (భీష్ముడు) కాంతారావు (ద్రుపదుడు) రంగనాథ్ (ధృష్టద్యుమ్నుడు) రావుగోపాలరావు (శల్యుడు) సుదర్శన్ (ఘటోత్కచుడు) సి. హెచ్. నారాయణరావు (వ్యాసుడు) సాక్షిరంగారావు (వసంతకుడు) అంజలీదేవి (కుంతి) జమున (ద్రౌపది) విజయనిర్మల (సుభద్ర) లత (సత్యభామ) చంద్రకళ (రుక్మిణి) జయప్రద (ఉత్తర) ఉదయచంద్రిక (రేవతి) కృష్ణకుమారి (భానుమతి) 'కురుక్షేత్రంలో' పాత్రలూ, పాత్రధారులు వివరాలివి. మన్నించాలి! ఇవన్నీ రాసి చేయి నెప్పెట్టింది! ఎక్కువ వివరాలివ్వలేక పోతున్నాము. నిర్మాత ఎ ఎస్.ఆర్. ఆంజనేయులు దర్శకత్వం కమలాకర కామేశ్వరరావు అన్న వార్త మినహా, మరో సంచికలో మరికొన్ని వివరాలు, విశేషాలు.

## ప్రేమించి పెళ్ళిచేసుకో!

శ్రీ కె. హేమాంబరధరరావుగారి దగ్గర కుడిభుజంగా వుంటూ ఇతరత్రా అన్ని రంగాల్లోనూ పలుకుబడి సంపాదించిన యువకులు శ్రీ కె. మహేంద్ర-మహేష్ ఎంటర్‌ప్రైజెస్ పతాకం క్రింద "ప్రేమించి పెళ్ళిచేసుకో"మని చెప్పబోతున్నారు తమ చిత్రం ద్వారా. చురుకుగా సాగుతున్న యీ చిత్రంలో మురళీమోహన్, గిరిబాబు, సత్యనారాయణ, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, సాక్షి రంగారావు, కె. వి. చలం, సారధి, ముక్కామల, జయచిత్ర, రమాప్రభ, ఛాయాదేవి, ఝాన్సీ మొదలైన నటీనటులు నటిస్తున్నారు. ఈ చిత్రానికి దర్శకులు కె. హేమాంబరధరరావు, కథ, మాటలు వి.ఎన్. మూర్తి, సంగీతం సత్యం, సహకార దర్శకత్వం ఎస్.వి. గోపాల్ నిర్వహిస్తున్నారు.

## జన్మజన్మల బంధం

త్వరలో విడుదలకు సిద్ధమౌతున్నది వెంకటరమణ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్ చిత్రం 'జన్మజన్మల బంధం'. ఈ చిత్రంలో కృష్ణ, వాణిశ్రీ, గుమ్మడి, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, సత్యప్రియ, రమాప్రభ మొదలగువారు నటించారు. కథ లలితాదేవి, మాటలు మహారధి, పాటలు ఆత్రేయ, సంగీతం మహాదేవన్, దర్శకత్వం పి. సి. రెడ్డి, నిర్మాతలు ఎల్. భాస్కరరావు, ఎస్. కనకసుందరరావు.

## స్వర్గానికి నిచ్చెనలు

ఫిల్మాలయ కంబైన్స్ బేనర్‌పై ఎస్. గోపాలకృష్ణదర్శకత్వంలో రామచంద్రన్, పంజు అరుణాచలం నిర్మించిన "స్వర్గానికి నిచ్చెనలు" చిత్రంలో రామకృష్ణ, జయచిత్ర, ప్రభ, చంద్రమోహన్, సిహెచ్. నారాయణరావు, జి. నిర్మల, బేబీ సుమతి, పుష్పకుమారి నటించారు. మాటలు జూనియర్ సముద్రాల, గీతాలు ఆత్రేయ, సంగీతం మహాదేవన్, అతిత్వరలో విడుదల కాబోతున్న చిత్రమిది.

## తెలుగు తెరకు

# నూతనతరం

అయిదున్నర సంవత్సరాల వయసున్న ఓ చిన్న అమ్మాయి వేదికపైన జరుగుతున్న హరికథ విని ఉత్తేజితురాలై ఉత్సాహపడిపోయింది. హరికథ చెప్పడంలో అంతకు ముందు ఏ విధమైన శిక్షణా లేకపోయినా, వయసు చిన్నదైనా ఒకగంట దీక్షగా హరికథ విన్న ఆ పాప వేదికపైకి పరిగెత్తి అయిదు నిమిషాల పాటు హరికథ చెప్పింది. ఆ అమ్మాయి పేరు కోటిసూర్యప్రభ. ఆమె ఇప్పటి సినీ నటి ప్రభ. హరికథ చెప్పడంలో పేరొంది, ఆంధ్రదేశంలో అనేక చోట్ల హరికథాకాలక్షేపం చేసిన కోటి సూర్య ప్రభ—ప్రభగా 'నీడలేని ఆడది' చిత్రం ద్వారా తెలుగు తెరకు పరిచయమయింది. నీడలేని ఆడది అపూర్వమయిన విజయం సాధించడంతో తెలుగు సినిమా ప్రభకు చల్లని నీడ నిచ్చింది. 1974లో సినీనటిగా జీవితం ప్రారంభించిన ప్రభ, 1976 ఆగష్టు నాటికి పన్నెండు చిత్రాల ద్వారా తన నటనను ప్రేక్షకులకు అందించింది.



పూర్తి అయి విడుదలకు సిద్ధంగా, పూర్తి కాబోతూ, షూటింగులు జరువుకొంటూ ఉన్న మరో పదిహేను చిత్రాలలో ప్రభ నటిస్తోందిప్పుడు. అతి స్వల్పకాలంలో ఇన్ని చిత్రాలలో నటించడం ప్రభకు పరిశ్రమ ఇచ్చిన గుర్తింపుకు చిహ్నమే మరి. తునివే తుణై (ధైర్యమే సాహసమనో ఏదో అర్థమట) అనే తమిళ చిత్రం ద్వారా పరభాషా చిత్రాలలో ప్రవేశంచేసి ఈతార త్వరలో కమల్ హాసన్‌కు జోడిగా మళయాళంలో నిర్మించబడే ఓ చిత్రంలో నటిస్తోంది. 'చివరకు మిగిలేది' చిత్రంలో సావిత్రి నటన చూశాక సినీనటి కావాలన్న కోరిక బలంగా పెంచుకొన్న ఈ నటి చిన్నతనంలోనే నాట్య దర్శకుడు శైవాగారి దగ్గర భరతనాట్యంలో శిక్షణ పొందింది. అభిమానులఉత్తరాలకు అమితమైన గౌరవంఇస్తూ ప్రతిఉత్తరానికీఅంతకు ముందే ముద్రించి ఉంచిన సర్క్యులర్ సమాధానం గాక, ఉత్తరానికి పాయింట్ టుపాయింట్ సమాధానం ఇస్తోంది నటి. చిత్రచిత్రానికీ నటనలో కొత్త శక్తిని పుంజుకుంటూ ముందుకు పయనిస్తున్న ప్రభ తెలుగు చిత్రరంగాన గల ప్రముఖ నటీమణుల జాబితాలో చేరి, మరెన్నో విజయాలవైపు పయనిస్తోంది. కొల్లేటి కాపురం, మహాత్ముడు, స్వర్గానికి నిచ్చెనలు, పెద్దన్నయ్య, అదృష్టవంతురాలు, దానవీర శూరకర్ణ, మంచికి మరో పేరు, దేవుడు చేసిన బొమ్మలు—త్వరలో విడుదలవబోతున్న ప్రభ నటించిన చిత్రాలు.

—యస్వీనారాయణ

# తెలుగు తెరకు

# నూతనతరం

కీర్తిశేషులు నాటకంతో కీర్తి అశేషంగా పెంచుకుని నాటకరంగ స్థలంపై యశచ్చంద్రికలు వెలార్చుకున్న నటుడు రావుగోపాలరావు. ఆయన మిత్రులకు, కావలసినవాళ్ళకి అతని పేరు రా॥గో॥రా-

ఎందుకు మేమంతా అలా పిల్చుకుంటామంటే టాగూర్ సాహిత్యంలో. ప్రసిద్ధమైన పాత్ర గోరాని మర్చిపోకుండా గుర్తుంచుకుందామని—

రంగస్థలిపై ఇరవై ఏళ్ళవయసునుంచి అరవై ఏళ్ళ వయసుగల పాత్రలు ధరించి ఇంకా పాత్రలకి మరింకే నటుడు సరిపోనంత ముద్రవేసి వదిలేవాడు—

ఆ నాటక పుస్తకంలో ఆయన పేరు ఫలానా పాత్ర ధరించినట్టు పడితే కొత్తగా వేద్దామనుకున్న నటుడు మీన మేషాలు లెక్కపెట్టేవాడు. అలాటి ముద్రతో యితరులను భయపెట్టి, తన ప్రేమానురాగాలతో ప్రతి నటుడిని హితుడిని లాలించి, కేవలం నాటకరంగానికే అంకితమైపోయాక చిత్రరంగానికి మొదట సహకారదర్శకునిగా ప్రవేశించి— అందులో కొంతకాలం పనిచేశాక నటుడుగా జీవితం ఆరంభించాడు........

మొదట్లో చిన్నవేషాలు వేసినా— "శారద"లో మునసబు బాబాయి— "ఇదా లోకం"లో కిరాయి రౌడీ పాత్రల్లో బాగా రాణించి, చిత్రపరిశ్రమలో కాలు నిలదొక్కుకున్నాడు....

"ముత్యాల ముగ్గు" చిత్రంలోని కంట్రాక్టర్ పాత్ర ద్వారా తెలుగువారి హృదయసీమలలో స్థిరమైన పీఠం



ఏర్పరుచుకుని మూడు ముత్యాలు—ఆరు రత్నాలుగా వెలుగొందుతున్న నట బాంధవుడు మా రా॥గో॥రా—

ముత్యాల ముగ్గు కంట్రాక్టర్‌గా రావు గోపాలరావు 'ఎప్పుడూ బిగినెస్సేనా.... కాసంత కలాపోసన కూడా ఉండాలయ్యా' అన్న మాటలు విని హాయిగా....కాదు.... హోరుమంటూనే నవ్వుకొన్నారు జనం.. కాని నిజ జీవితంలో రాగోరా నిజంగానే కళా పిపాసి. కళలంటే ప్రాణంగా భావించే రసహృదయుడు. సినిమా నటనతోపాటు మిత్రులతో సాహిత్యగోష్ఠి, సన్నిహిత మిత్రులతో సరదా సంభాషణలూ, చలనచిత్ర నిర్మాణంలో తనకున్న అనుభవాన్ని కేవలం నటుడిగానే గాక, ఇతర విభాగాలలో కూడా అజ్ఞాతంగా చిత్రాలకు అందజేస్తూ కాలం గడుపుతున్నవాడు గంభీరస్వర రావుగోపాలరావు.

—రామ్‌సూరి

## కొత్త పుస్తకాలు

### —స్వీకారం—

ప్రేరణ; రచన: కె. ప్రభాకర్; వెల. రు: 3/-ప్రతులకు: రవి ప్రచురణలు, ఇం. నెం. 41 (సి.ఐ.బి. క్వార్టర్సు) పిక్చర్స్‌హౌస్ దగ్గర, హైదరాబాదు—500 004.

'ప్రణయ పంకాన పడని వారుందురా లోకాన.

పడి విరహగీతాలు రాయకుందురా శోకాన'

అని ప్రారంభిస్తూ ఈరచయితప్రణయ కవితగా రాశారీ అరవై పేజీల పుస్తకాన్ని.

* * *

శిలలో సెలయేరు; కథల సంపుటి రచన. విహారి & శాలివాహన; వెల: నాలుగు రూపాయలు; ప్రతులకు స్పందన సాహితీ సమాఖ్య (రిజిష్టర్డ్), 23/182E. న్యూమునిసిపల్ క్వార్టర్స్, మచిలీపట్టణం జంట రచయితలు విహారి & శాలివాహన రచించిన ఎనిమిది కథలు ఈ సంకలనంలో ఉన్నాయి.

* * *

పసిడిమనసుల పాలపాటలు; రచన: వింజమూరి లక్ష్మి; వెల: రు. 3-50 ప్రచురణ. బుడుగు బుక్స్, ఏలూరురోడ్, విజయవాడ-2; సోల్ డిస్ట్రిబ్యూటర్స్; నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్ విజయవాడ-2.

చిన్న పిల్లలకోసం రాయబడ్డ చక్కని పాటలకు బాపు చిత్ర రూపకల్పన చేశారీ పుస్తకంలో. ప్రతి పేజీ రెండు రంగుల్లో ఆకర్షణీయంగా ముద్రించబడింది. కవిత్వం అంటే ఇష్టంలేని వారుకూడా బాపు బొమ్మలకోసం కొనుక్కోతగ్గ పుస్తకం.

* * *

రంజని; ఏ. జి. ఆఫీసు తెలుగు సాహితీ సమితి (హైదరాబాద్) ప్రచురించిన వార్షిక సంచిక. సాధారణంగా 'సావనీర్'లలో కన్పించే ప్రకటనల ప్రకటనే కాక చక్కని కథలూ, కవితలూ వ్యాసాలూ ప్రచురించి చక్కటి సాహిత్య సంచికగా ఈ వార్షిక సంచిక [సంపుటి-15; సంచిక 15] ను తీర్చిదిద్దారు. జె. ఉమామహేశ్వరరావు, గుమ్మా ప్రసన్న కుమార్. పి. రామబ్రహ్మం ఈ సంచికకు బాధ్యతలు నిర్వహించారు.

* * *

వినరాసుమతీ (సుమతి శతకానికి సుజనరంజనీ వ్యాఖ్య); రచయిత: డా॥ వి.వి.యల్. నరసింహారావు; వెల. రెండు రూపాయలు; ప్రతులకు స్పందన సాహితీ సమాఖ్య రిజిష్టర్డ్) 23/182E. న్యూ మునిసిపల్ క్వార్టర్స్, మచిలీపట్టణం.

* * *

పూలమాల (గేయ సంపుటి); రచన సమయమంత్రి రాజ్యలక్ష్మిదేవి సరస్వతీ ఆర్ట్ ప్రెస్, పడమట. విజయవాడ-520006 లో ముద్రించబడిన వివరం మాత్రమే వున్నది. వెలకానీ, ప్రచురణకర్తల పేరు కానీ లేదు.

* * *

మతప్రస్థానం; రచన: అశోక్‌కుమార్ వెల. రు. 1-50 ప్రతులకు: సమత

గ్రంథాలయం, బ్రాహ్మణ వీధి, విజయ వాడ-520 001.

'అవిగవిగో మదపుటేనుగులు
గడ్డిపోచల్లారా ఏకంకండు
అవిగవిగో విషసర్పాలు
చలిచీమల్లారా పోగవ్వండి.

అంటూ అన్యాయలను తుదముట్టించేం దుకు పాఠకుల్ని ఉత్సాహపరుస్తున్న రచయిత ఈ పుస్తకాన్ని 'నా కలం వేగా నికీ, నాగళం రాగానికీ, గురువైన శ్రీశ్రీ'కి అంకితమిచ్చారు.

* * *

నవ్యపథం; (నల్లగొండ జిల్లా రచయి తల మహాసభల ప్రత్యేక సంచిక) వెల రు. 5/— ప్రతులకు' యువరచయితల సమితి, నల్లగొండ.

మాలిక; (కథా సంకలనం) నిర్మల్ దేవరాజు మహారాజు, మూటుపూరు కృష్ణ మూర్తి, అలుగుపల్లి రామచంద్రారెడ్డి, మేరెడ్డి యాదగిరిరెడ్డి, బి. రాములు పి.వి. పి. రాజు, విద్వాన్ యానాల, నటువా వెంకటయ్య ఈ రచయితల ఒక్కొక్క కథ చొప్పున ప్రచురించబడ్డ ఈ సంకల నం వెల మూడు రూపాయలు, ప్రచురణ: యువరచయితల సమితి, నల్లగొండ.

* * *

దివిటీ; (కవితా సంకలనం) నందిని పిదారెడ్డి. కందుకూరి శ్రీరాములు, కర్ణాల బాలరాజుల మినీ కవితలున్నా యీ మినీ పుస్తకం వెల ఒకరూపాయి. కె. బాల రాజు, రావురూకుల (పి. ఒ), సిద్ధిపేట తాలూకా, మెదక్ జిల్లా.

* * *

'స్నేహబాల'; పిల్లలకోసం మాస పత్రిక: విడిప్రతి వెల: రు. 1-25; నాయుని కృష్ణమూర్తి; కార్యాలయం: 3, దొరస్వామి గ్రామణి స్ట్రీట్. వడపళని. మద్రాసు-26.

ఇది స్నేహబాల నాలుగో సంచిక. మొదటి మూడుసంచికలూ పక్షపత్రికలుగా వెలువరించడం జరిగిందని ప్రకాశకులు తెలిపారు. మామూలుగా పిల్లల పత్రిక లన్నీ ఉన్న సైజులోనే వున్న ఈ పత్రికలో సాధారణంగా పిల్లల పత్రికలో మనం చూసే కథలూ, సీరియల్సుగాక— పత్రిక నూతన తరహా ఉందనిపిస్తూ ఇతర శీర్షికలూఉన్నాయి, 'మీకు తెలిసిన తెలుగు' పిల్లలకు తెలుగు భాషాజ్ఞానం అధికంగా కలిగించేందుకు ఉద్దేశించబడింది. అలాగే 'ఈ శతాబ్దంలో కొందరు' శీర్షిక పిల్లలకు ఉపయుక్తంగా వుంది. మధ్యలో నాలుగు రంగులలో ముద్రించిన పదహారు పేజీల లోనూ మూడు పేజీలు జాతక కథను రంగుల చిత్రీకరణతో అందించేందుకు కేటాయించారు. మంచి మార్పుకోసం ఈ పత్రిక—ఎంత చిన్నదైనప్పటికీ—ప్రయ త్నం చేయడం ముదావహం.

# మద్యపానం వినాశకారి

మిమ్మల్నూ,
మీ కుటుంబాన్నీ
అది నాశనం
చేస్తుంది



Edited and Published by V. Leelavathy Raghavaiah, 40/1, Mo
... 500 017 and Printed by D. Hanumantha

JYOTI NOVEMBER 76 Rs.3



మోడల్ ప్రొడక్షన్స

# సుప్రభాతం



కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం

నిర్మాత
కె.కృష్ణమోహన్